# స్టేన్స్‌టైర్

# సమస్యలను పరిష్కరిస్తుంది



స్టేన్స్ టైర్ రీట్రెడ్‌లు సురక్షితమైనవి. ప్రఖ్యాతి గాంచిన టైర్‌సోర్స్ సాంకేతిక పరిజ్ఞానాన్ని స్టేన్స్‌టైర్ వినియోగించు కుంటుంది. మీ టైరు ఎక్కువకాలం పనిచేసేటట్టు గ్యారంటీ ఇస్తుంది.

స్టేన్స్ టైర్ ఎక్కువ ఆదాచేస్తుంది. ప్రతి కేసింగ్‌కు ఎక్కువ రీట్రెడ్‌లు చేయవచ్చు— కాగా లాభకరమైన అంశం. ప్రతి కిలో మీటరును లెక్కకడితే ఖర్చు అతితక్కువ కాగలదు. ముఖ్యమైన కేంద్రాలలో వున్న స్టేన్స్ టైర్ ఫ్యాక్టరీలు వెంటనే సేవచేయడంలో గణతి కెక్కినవి.

**STANESTYRE**

**స్టేన్స్‌టైర్**

**అండ్ రబ్బర్ ప్రాడక్ట్స్ లిమిటెడ్**

తిరుచీ రోడ్, కోయంబత్తూరు

ఫ్యాక్టరీలుగల ఇతర కేంద్రాలు : మద్రాసు. వెల్లూరు, తిరుచి. సేలం, మధురై. ట్యుటికోరన్, బెంగుళూరు, మెంగుళూరు, విజయవాడ, సికింద్రాబాద్, ఎర్నాకుళం, కొట్టాయం, కాలికట్, తిరుచూరు.

MAC (B) ST-1/75

# ఉత్తరాలు

## అట్టమీద బొమ్మ

నటనలో మశూర్
పేరే రిషి కపూర్
ముఖచిత్రమే ఎంతో ఫేర్
ధర్మపథం ఎంతోప్యూర్
"ఆడబుద్ధి" కథబెటర్.
"శ్రావణ సంధ్య" సీరియల్ సూపర్.

సిరికొండ వెంకటేశం (కరీంనగర్)

* * *

28—11—75వారపత్రిక "ముఖచిత్రం" పత్రికలకే హైలైట్. ముఖచిత్రాలు ఏ సినిమాలవో తెలియజేస్తూ వుంటే బాగుంటుంది.

శ్రీరంగ సత్యనారాయణ పి. రత్నమాల (మొగల్తూర్)

[★ సాధారణంగా ఆయా తారల ప్రత్యేక చిత్రాలు వేస్తుంటాము కదా సం.]

## సినిమా

సుమారు 10 వారములనుండి మన పత్రికలో మాత్రం ఎంతసేపటికీ క్షేత్రయ్య, హిమాను, కోటలోపాగ, కన్నప్ప తప్ప ఇంకేమీ ఉండుటలేదు. శ్రీనివాస్‌గారు ఇకనుంచి ఆ పారాయణాన్ని ఆపి, సమంగా విశేషాలను అందిస్తారని ఆశిస్తున్నాము.

అల్లూరు మధుసూదన శర్మ (కావలి)

## సీరియల్

మీ (మా) పత్రికలో వెలువడుతున్న, వర్ధమాన రచయిత్రి కుమారి బొడ్డుచర్ల గౌరీదేవిగారి గెలుపునాదే సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా ఉంది. కానీ రచయిత్రి అందులో సెప్టెంబర్ 18, సెప్టెంబర్ 21, లని ఎందుకు వ్రాసారో, అది డైరీనా, లేక కథేనా అర్థం కావటములేదు. 21—11—75 సంచికలో శ్రీ మంగా నాగభూషణరావుగారు రచించిన కథకు "పెళ్ళినాడు" పేరు బావుండలేదు. ఆ కథకు "ఏప్రిల్ ఫూల్" అని పెడితే బావుండేదని మా అభిప్రాయము. రామలక్ష్మిగారి జవాబులు ఘాటుగా స్వీటుగా పత్రికకే ఒక హైలెట్ ఇకముందు కూడా ఇలాగే మంచి, మంచి కథలు, సీరియల్స్ మీ(మా)పత్రికవెలువడుతుందని ఆశిస్తూ.

కుమారి రాజ్యలక్ష్మి, టి. వసంత, బి. రమాదేవి, బి. కుసుమాంబ, (నందిగామ)

## కథలు

ప్రతివారము మీ (మా) పత్రిక చాలా విజ్ఞాన విషయాలను తెల్పుచున్నది. 21—11—75 నాటి ముఖ చిత్రం రిషికపూర్ చాలా బాగున్నది. గెలుపునాదే సీరియల్ చాలా రసవత్తరంగా నడుస్తున్నది. పెళ్ళినాడు, ఆడబుద్ధి కథలు చాలా బాగున్నాయి.

కలిదిండి రామలింగరాజు (పెద్ది)
మంతెన సత్యనారాయణరాజు (మహాదేవపట్నం)

ఈ వారం పత్రికలో "ఆడబుద్ధి" కథ బాగుంది.

'సామాన్యుని సణుగుడు', 'నమ్మ, నమ్మకపో' శీర్షికలు బాగుంటున్నాయి. 'మినీ ఇంటర్వ్యూలకు' బదులుగా ప్రతివారం ఒక కొత్త రచయిత గూర్చి ప్రచురిస్తే బాగుంటుంది.

టి. మోహినీ పద్మ (ఏలూరు)

## నమ్మా నమ్మకపో

యువనటుడు "రిషికపూర్" ముఖచిత్రం 21—11—75 వతేదీ పత్రికకు ఎంతో వన్నె తెచ్చింది. ముద్దా రమేష్‌గారి "నమ్మ నమ్మకపో" ఎంతో బాగున్నది. ఇటువంటివి మరి కొన్ని ప్రచురించండి. "ఆడబుద్ధి" కథానికలో రచయిత స్త్రీల మనస్తత్వాన్ని చక్కగా చిత్రీకరించారు. హైదరాబాద్ నోట్ బుక్ ఏమాత్రం ఉత్సాహం కలిగించటం లేదు. "సామాన్యుని సణుగుడు" పత్రికకు హైలెట్

ఎస్. ఎస్. శాస్త్రి బి. కాం., (శ్రీకాకుళం)

* * *

మీ (మా) పత్రికలో ప్రస్తుతము నడుస్తున్న సీరియల్స్ చాలా బావుంటున్నవి. పత్రికలో వస్తున్న కొన్నిలోటుపాట్లును గమనించవలసిందిగా కోరుచున్నాను. మీ (మా) పత్రిక ఇంకా అభివృద్ధి చెందాలంటే కొన్ని సూచనలు.

★ ప్రశ్నావళిలో రమాలక్ష్మిగారుకాకుండా ఇంకా ఎవరితోనైనా జవాబులు ఇప్పించాలి. లేక ప్రశ్నావళి ఎత్తివేసి ఆ పేజీని సినిమాకు కేటాయించాలి.

★ జనరల్ నాలెడ్జి కొరకు ఏదైనా క్రొత్త శీర్షిక ప్రవేశపెట్టాలి.

వనం లక్ష్మణ్‌రావు (ఖమ్మం)




"ఇదేమిట్రా క్రిందటేడు నీ అన్నయ్య రాసిన వ్యాసంలాగే వుంది ఈ సారి నువ్వు రాసిన కుక్కమీద వ్యాసం ?"

"అవును మేష్టారూ మరి నేనూ అదే కుక్కమీద వ్యాసం రాసేను"

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938 - 1972)

శుక్రవారం : 12-12-'75

రాక్షసనామసం. మార్గశిర శు. నవమి

*సంపుటము : 69 సంచిక : 14*

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా — రు. 33-80

ఆరుమాసాల చందా — రు. 16-90

విడిప్రతి వెల 60 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయసూచిక





## లోకం పోకడ — ఊమెన్









# మేడిపండు

**పవన్**

మడిబట్ట తడిపి, ఆరేసుకోవటానికి బావి దగ్గరకు బయలుదేరిన సుబ్బమ్మగారు, చంటిదాన్ని శుభ్రం చేయడానికి రెక్కపుచ్చుకుని, బయటికి వచ్చిన కామేశ్వరి, బాత్‌రూంకి వెళ్లబోతున్న శేషగిరి, టూత్ బ్రెష్ నోట్లో పెట్టుకుని, బాదంచెట్టు క్రింద పళ్లు తోముకోవడానికి వచ్చిన సౌదామిని ఈ నలుగురి కళ్లూ ఒక్కసారిగా నూతి చప్టాలో గళ్లలుంగీ మోకాళ్ల వరకు మడుచుకుని, కట్ బనీను వేసుకుని, బావిలోంచి బకెట్టుడు నీళ్లు లాక్కుని ముఖం కడుక్కుంటున్న ఆరడుగుల అందమైన విగ్రహం మీద నిలిచిపోయి, తరువాత "ఎవరీతను?" అన్నట్లు ఒక జత కళ్లతో ఒక జత కళ్లు ప్రశ్నించుకుంటూ వుండగా ఆ అందమైన విగ్రహం హుందాగా అడుగులు వేసుకుంటూ, దొడ్లో అనసూయమ్మ వుంటున్న రేకుల షెడ్డు గదిలోకి వెళ్లింది. దాంతో ఆ నాలుగు జతల కళ్లు ఆశ్చర్యంగా అటే చూస్తూ, "ఏమిటీ ఆ వంటావిడకు ఇంత అందమైన కొడుకు వున్నాడా! లేక చుట్టమా? ఆమెకు ఎవరూ వున్నట్లు లేరే! ఏమౌతాడో?" అనుకుంటూ ఎవరి పనుల్లోకి వాళ్లు వెళ్లిపోయారు.

ఇంటావిడ సుబ్బమ్మగారు స్నానం చేసి, తడి బట్టలో సూర్యనమస్కారాలు చేసుకుంటూ వుండగా, ఆ ఆరడుగుల అందమైన గళ్లలుంగీ మళ్లీ నూతి దగ్గరకు వచ్చి, నీళ్లు తోడుకుని స్నానం చేస్తున్నాడు. పచ్చగా, దబ్బ పండులా వున్న అతన్ని చూసి, ముచ్చటవేసి, సుబ్బమ్మగారు చేసే సూర్యనమస్కారాలు ఆపేసి, అతనికేసే చూస్తూ, "తాయారుకి ఇటువంటి మొగుడు దొరికితే బాగుండును!" అనుకుంటూ వుంది.

అప్పుడే స్నానం చేసి, బాత్‌రూమ్‌లోంచి బయటకు వస్తున్న శేషగిరి నూతి దగ్గర స్నానం చేస్తున్న అతని, బలిష్టంగా అరటి దూటల్లావున్న కాళ్లని, తెల్లని, గుండ్రటి భుజాలు చూసి, అప్రయత్నంగా తన కాళ్లూ భుజాలు చూసుకున్నాడు. సన్నగా, నల్లగా, పొంజారిన కట్టెల్లా కాళ్లు, బనీను చిరుగుల్లోంచి నిక్కపొడుచుకుని, తొంగి చూస్తున్న చిరు ఎముకలు, ముప్పైఏళ్లకే ముడతలు పడ్డ చర్మాన్ని చూసుకుని, సిగ్గుతో కుచించుకుపోతూ, పైకి మడుచుకున్న కుళ్లు లుంగీని కిందకు జారవిడిచి, భుజం మీద వున్న తువ్వాలును నిండుగా కప్పుకుని, వడిగా అడుగులువేస్తూ, "ఒరేయ్ శేషుగా! నీలాగా పెళ్లి కావలసిన చెల్లెలు, చదువు చెప్పించవలసిన తమ్ముడు, అదీగాక తెల్లవారిందిమొదలు అవిలేవు ఇవి లేవు అని సతాయించే భార్య అనబడే మెడకొక గుదిబండ, పాలడబ్బాల కోసం గోలపెట్టే వంశోద్ధారకు లనబడే రాక్షసులు. చెఱుకు గడను నమిలినట్లు నమిలి అతన్ని పీల్చి పిప్పిచేయడానికి వుండి వుండరు. అందుకనే అతను అంత అందంగా, ఆరోగ్యంగా వున్నాడు." అని తనపై తానే జాలిపడి, సానుభూతి చూపించుకుని, సమాధానపడుతూ, ఇంట్లోకి వెడుతూ వుండగా, అరటికాయ కూర్లోకి ఆవనూరుతున్న భార్య కామేశ్వరి రెప్పవాల్చకుండా, నూతికేసి చూస్తూ వుండటం చూసాడు. దాంతో వొళ్లు మండి



పోయింది. పళ్ళు పటపట కొరుక్కుంటూ, "సిగ్గూ ఎగ్గూ లేకుండా, ఇద్దరి బిడ్డల తల్లియై వుండీ, పరాయి మగాడికేసి, గుడ్లు మిటకరించుకు చూస్తుందా? ఇదేనా పతివ్రతా లక్షణం?" అనుకొంటూ కొరకొరా భార్యకేసి చూస్తూ, వంటింట్లోకి వెళ్ళాడు. కిరసనాయిల్ స్టవ్ మీద పులుసు పొంగి, పొయ్యిలో పడుతోంది. "ఇదిగో నిన్నే! ఆ రోటిదగ్గరెంతసేపలా తగలడతావ్? పులుసంతా పొంగి తగలడుతోంది." అంటూ కేకేశాడు. ఆవముద్ద చేత్తో వూడ్చి పట్టుకువచ్చి, "అలా గావుకేకలు పెట్టకపోతే స్టవ్ తగ్గించకూడదూ? తెలివి!" అంటూ స్టవ్ తగ్గించి. ఆవముద్దని కూరలోవేసి, కలపసాగింది కామేశ్వరి.

అదే సమయంలో తన గదిలో కిటికీదగ్గర నుంచుని, జడ వేసుకుంటున్న పెళ్ళిపిన్ సౌదామిని· నూతిదగ్గర స్నానం చేస్తున్న అతన్ని చూసీ, చూడనట్టు మధ్య మధ్య అతనికేసి చూస్తూ, ఇటు తెలుగు, అటు హిందీ సినిమాల హీరోల సందరికీ సెమరు వేసుకోసాగింది. తరువాత ఎవరి పనులలోకి వారు, ఎవరి ఆఫీసులకి వారు వెళ్ళిపోయినా, "అనసూయమ్మకు ఏమౌతాడు? ఎవరీతను?" అన్న ప్రశ్న అందరి బుర్రల్లోనూ దొలుస్తూనే వుంది.

అనసూయమ్మ ఉదయం అయిదున్నరకి జడ్జీగారింటికి వంటకి వెళ్లి మళ్లీ రాత్రి పదింటికి వస్తుంది. పెళ్ళికాని సౌదామిని, ఇద్దరి బిడ్డల తల్లైనా పటుమని పాతికేళ్ళులేని కామేశ్వరి పరాయి మగాణ్ణి ఏమడుగుతారు? శేషగిరికి అతన్ని చూడటానికే సిగ్గుగా వుంది. పైగా అతన్ని చూస్తే అసూయగా కూడా వుంది. ఇంకేమడుగుతాడు?

అనసూయ అద్దెకి వచ్చి నాలుగునెల్లైనా అద్దెకిచ్చిన్నాడు తప్ప సుబ్బమ్మగారు మళ్లీ మాట్లాడలేదు. ఆ గదిలోకి తొంగిచూడలేదు. మాట్లాడవలసిన అవసరం కూడా కలగలేదు. అద్దెకూడా ఠంచనుగా ఫస్టు తారీఖునాడు అనసూయమ్మే తెచ్చి ఇస్తోంది. ఇప్పుడు తనకు తానుగా వెళ్ళి, ఆ పిల్లాడిని అడగటానికి ఏమిటోలాఅనిపించింది సుబ్బమ్మగారికి." ఆ; ఈరోజు కాకపోతె రేపైనా తెలియకమానదు. ఎవరైతె ఏం లెమ్మని వూరుకుంది.

సాయంత్రం కామేశ్వరి పప్పు రుబ్బుతూ వుండగా అతను నీట్‌గా డ్రస్ వేసికొని, బయటకు వెళ్తున్నాడు. అప్పుడేఆఫీసునుండి వస్తున్న సౌదామిని అతను ఏదో ఆలోచిస్తున్నట్టుగా, పరధ్యానంగా అడుగులు వేస్తూ వుండటం క్రీగంట చూసింది. అతని ముఖంలో అంత ఉత్సాహం కన్పించలేదు. "బహుశా అతనికి ఉద్యోగం వుండి వుండదు." అనుకుంది. రాత్రి పదిగంటలవరకు పత్రిక చదువుతూ కూర్చున్న సౌదామినికి అనసూయమ్మ వచ్చి, "ఒరేయ్! అబ్బాయ్! భాస్కరం!" అంటూ తమ రేకు తలుపు కొడుతూ వుండటం విని పించి, అతని పేరు భాస్కరం అనీ, బహుశా ఆవిడ కొడుకే అయివుంటాడని అనుకుంటూ పత్రిక దాచేసి, నిద్రలోనికి జారిపోయింది.

* * *

తెల్లవారి సుబ్బమ్మగారు స్నానానికి బయులుదేరేసరికి సరిగ్గా అతడు నూతి దగ్గర నిన్నట్లాగే ముఖం కడుక్కుంటూ. జడ్జీగారింటికి వెళ్ళబోతున్న అనసూయమ్మతో, "అమ్మా! ఈ రోజు కొంచెం తొందరగా రా!" అంటున్నాడు దాంతో అతను అనసూయమ్మ కొడుకేనని నిర్ధారణ చేసుకుంది, సుబ్బమ్మగారు. ఆవిడకో కొడుకు ఉన్నట్లే తెలియదు. ఎక్కడో చదువుకుంటూ వుండి వుంటాడు. వంటలక్క కొడుకైతే ఏం? తాయారుకి ఎంతపంది కుర్రాళ్ళనో చూపించి ఒక్కరిలోనూ ఇంత అందం, తీరీ లేనేలేవు పోనీ ఇతన్ని తాయారుకి చేసుకుంటేనో?...తప్పేముంది? తాయారుకి చేసుకున్నాక లక్షాధికారి సుబ్బమ్మగారి అల్లుడంటారు కానీ. వంటలక్క కొడుకని ఎవ్వరూ అనలేరు నిజానికి కాస్తలో కాని పిల్లాణ్ణి తెమ్మకుంటేనేనయం! లేకపోతే నల్లటి తాయారుని, మొగదక్షతలేని తనను లెక్కచేయరు" అనుకుంది.

* * *

తెల్లటి సుబ్బమ్మగారికి నల్లటి తాయారు పుట్టగానే మొదట ఏడుపు వచ్చింది. 'ఆవిడ భర్త నలుపే! మరి భర్త పోలిక తాయారుకి వచ్చింది. ఆయన "ఈసారి పుట్టిన బిడ్డకి నీ పోలిక వస్తుందిలే, సుబ్బూ!" అంటూ ఓదార్చేడు. కాని మరో బిడ్డ పుట్టకుండానే ఆయన హఠాత్తుగా ఆవిడని గంగాభాగీరథి చేసి పోయేడు. అన్నం చొరవేకానీ అక్షరం చొరవలేని తాయారు ఏడవ తరగతిలోనే పాతం వేసుక్కూర్చుని, చూస్తూ వుండగానే గుర్రంలా ఎదిగిపోయి, చిన్నపిల్లలమధ్య కూర్చోవటానికి బిడియంగా వుండి, "ఇక స్కూలుకు పోను' అని మొరాయించింది.

ఇపుటికాలం కుర్రకుంకలు పిల్లకి ఏదో ఒక క్వాలిఫికేషన్ వుండాలని చేసుకోమని మంకుపట్టు పట్టుక్కూర్చుంటున్నారని ఆ నోటా ఈ నోటా విని, తాయారునీ చదువుల సరస్వతి చేయటం ఎలానూ అసాధ్యం కనుక ఎమ్. ఎస్. సుబ్బలక్ష్మిలాగ సంగీత సరస్వతినైనా చేద్దామని ఒక మంచిరోజు చూసి, హార్మోని పెట్టికొని, పంతుల్ని పెట్టింది. పంతులు లోపమేమీ లేకుండా రెండుపూటలా వచ్చి, చెపుతూనే వున్నాడు కానీ, ఏడాది కావస్తున్నా సా. పా సా. లతో స్వతి కలపటానికి తంటాలు పడుతూనే వుంది తాయారు పెళ్ళికి ఎదిగి కూర్చున్న నల్లటి తాయారుకు దబ్బపండులాంటివాణ్ణి చూసి, చేస్తే తెల్లటి పిల్లలు పుడతారని ఆవిడ లాజిక్. నల్లటి తాయారుకి దబ్బపండు

## విజ్ఞానం : వికాసం

### "ఓ జోన్" మండలానికి సూర్యుని ప్రమాదం

భూమి చుట్టూ ఉండే ఓ జోన్ కవచాన్ని దెబ్బతీసే మరొక అపరాధిని కొత్తగా కనుగొన్నారు. ఈ అపరాధి ఎవరోకాదు. సాక్షాత్తు సూర్యుడే.

సూర్యుడు శక్తిమంతమైన ప్రోటాన్లను వదులుతుంటాడు. ఇవి భూ వాతావరణంలో రకరకాల ప్రక్రియలను సృష్టిస్తుంటాయి. సూర్యుని ప్రోటాన్లకు ఢీకొని బయటపడిన ఎలెక్ట్రాన్లు గాలిలోని మాలిక్యూల్స్‌తో ఢీకొంటాయి. వరుసగా ఈ విధంగా జరిగే ప్రక్రియలద్వారా నత్రజని, అమ్లజనిలో ఓ జోన్ కలిసి నైట్రిక్ ఆక్సైడ్‌గా మారుతుంది. ఈ నైట్రిక్ ఆక్సైడ్ భూలోకంలో ప్రాణికోటికి రక్షణ కవచంగా ఉపయోగపడుతున్న ఓ జోన్ పొరను దెబ్బ తీస్తుంది. కనుక ఓ జోన్ పొరకు ప్రమాదకరంగా పరిణమించే మానవ చర్యల నన్నిటినీ నివారించి నప్పటికీ, సూర్యుని నుంచి అటి ప్రమాదం ఉండనే ఉన్నది.

## మేడిపండు

లాంటి వాడిని ముడిపెట్టడం ఏమంత కష్టమయినదిగా కన్పించలేదు సుబ్బమ్మగారికి మొదట. ఎందుకంటే, ఈ రోజుల్లో డబ్బుకున్న మహత్యం దేనికీలేదు. అంతగా అయితే తనకున్న ఆస్తి రెండు లక్షలకైనా తక్కువ కాదు కనుక ఒక లక్షమూట కట్టి నెత్తిన పెట్టి చూపిస్తే చచ్చినట్లు ఒప్పుకుంటారని'' ఆవిడ ఉద్దేశ్యం. రెండు మూడు దబ్బపళ్ళు నేరేడు పండులాంటి రాయారుని, నెత్తిమీద వున్న మూటకేసి ఎగాదిగా చూసి, ఎటూ తేల్చుకోలేక, చల్లటి సాయంకాలం వేళ స్కూటర్‌మీద షికారుకు వెళ్ళేటప్పుడు వెనక డబ్బుమూట పెట్టుకుంటే బావుంటుందా? సీతాకోక చిలుకను పెట్టుకుని తిరిగితే బావుంటుందా?'' అని మనసులోనే తర్జన భర్జనపడి, చివరకు సీతాకోక చిలుకే గెలిచి, ఆ దబ్బపళ్ళు కాస్తా పెదవి విరిచి పోయేయి. దాంతో ఆవిడకు దబ్బపండులాంటి మనవళ్ళను ఎత్తుకునే యోగంకూడా లేదేమోనని నిరుత్సాహం కలిగింది. కానీ, వెంటనే పట్టుదలకూడా పెరిగి, ఎలాగైనాసరే దబ్బపండులాంటి అల్లుడికోసమే చూస్తోంది. ఉద్యోగం సద్యోగం, ఆస్తి పాస్తి వున్నవాడు తన డబ్బుకి ఎలాగూ లొంగటం లేదని రెక్కల కష్టంతో జీవించే అనసూయమ్మ కొడుకైతే అభ్యంతరం చెప్పడని ఆలోచన చేసింది. ''తనలాంటి ఐశ్వర్యవంతురాలు పిలిచి, పిల్లనిస్తానంటే అనసూయకంతకంటే ఏం కావాలి? ఎగిరి గంతులెయ్యదూ?... మంచిరోజు చూసి, ఈ సంగతి అనసూయ చెవిని వేసి, ఆ మూడుముళ్ళూ త్వరలో వేయించెయ్యాలి?'' అనుకుంది సుబ్బమ్మగారు.

* * *

రాత్రి కామేశ్వరి శేషగిరికి అన్నంవడ్డిస్తూ, ''ఇదిగో, ఏమండోయ్! చూశారా? ఆ అబ్బాయి ఆవిడ కొడుకేటండీ,'' అంది ఆశ్చర్యకరమైన విషయం చెపుతున్నట్లుగా.

శేషగిరి కొంచెం విసుగ్గా ముఖం పెట్టి, ''ఏ అబ్బాయి? ఆవిడ ఎవరు?'' అన్నాడు.

''అదేనండీ! ఆ అబ్బాయే నూతిదగ్గర స్నానం చేయటంలా? అతను అనసూయమ్మ కొడుకేనట!''

''ఊ!'' అన్నాడు విసుగ్గా.

"ఏమీ లేకపోయినా పిల్లాడు లక్షణంగా వున్నాడు. ఏదో చదువుకొనే వుండివుంటాడు" భార్య అలా పరాయి మగాడి గురించిమాట్లాడటం, అందులో అందమైన ఆ కుర్రాడి గురించి మాట్లాడుతూ ఉండటం ఎంత మాత్రం ఇష్టంలేదు శేషగిరికి. కామేశ్వరి మీద బాగా కోపం వచ్చేసింది. అయితే అర్భకుడైన శేషగిరి పైకి కక్కలేక తనలోనే నిభాయించుకున్నాడు. దాంతో కామేశ్వరి వడ్డించిన అన్నం వెగటు కలిగి, అన్నంముద్దలు గొంతు దిగమని మొరాయిస్తున్నాయి. అయితే కామేశ్వరి ఇదేమీ పట్టించుకోకుండా తన ధోరణిలో తాను సాగిపోతోంది.

"అతనికి ఉద్యోగమేమీ వుండి వుండదు. అందుకే అవిడ అలా రెక్కలు ముక్కలుచేసుకుంటోంది."

"అయితే ఏం చెయ్యమంటావ్?" అని, "కాస్త పెర్శిగ తగిలెయ్!" అన్నాడు కోపంగా. ఇంకొకప్పుడైతే కామేశ్వరి తాచుపాములాగా బుస్ మనేది. ఆ రోజు ఎందుకో శాంతంగానే వుంది.

"ఏమిటా విసుగు? గోంగూర పులుసు కాచేను. మెల్లగా తినండి!" అంటూ కాస్త అన్నం, పులుసు వడ్డించింది. తనకిష్టమైన గోంగూర పులుసు కాచిందనేసరికి కాస్త మనసులోని దుఃఖంకపోయి, స్థిమిత పడ్డాడు.

"నాలుగక్షరం ముక్కలు నేర్చుకున్నవాడికి ఏదో ఉద్యోగం దొరక్కపోదు..." అంటూ మళ్లీ సాగిపోతోంది కామేశ్వరి.

అతని ప్రసక్తి తెచ్చేసరికి కారం రాసుకున్నట్లుగా వుంది శేషగిరికి.

"వాళ్ల గొడవ వాళ్లు చూసుకుంటారు. నీ కెందుకా ఏడుపు?" అన్నాడు విసుగ్గా.

"ఎప్పుడూ దుంపలా ముఖం పెట్టుకుని, ధుమ ధుమ లాడటం తప్ప ఏమీలేదు. మా శకుంతలకి ఈడూ జోడూగా వుంటాడని నా ఏడుపు?" అంది.

దాంతో స్థిమితపడి, "మీ నాన్న వంటలక్క కొడుక్కి ఇవ్వటానికి ఒప్పుకుంటాడా?" అన్నాడు.

"అయితే ఏం? బస్ కండక్టర్ల కొడుకులు కలక్టర్లు, వంటలక్క కొడుకులు ప్రొబేషనరీ ఆఫీసర్లు అయినవాళ్లు ఎంత మంది లేరు? లక్షణమైన కుర్రాడు. మంచి ఉద్యోగమే రావచ్చు!" అంది.

భార్య మాట నిజమే అనిపించింది శేషగిరికి. అయితే అంత అందమైన వాడ్ని తనకు తోడల్లుడుగా ఊహించుకోవటం కష్టం అనిపించింది. ఇంతలోనే చటుక్కున గుర్తుకు వచ్చింది. తన చెల్లెలు శారద. అతను కంచంలో చెయ్యి కడుక్కుంటూ, "నిజమే! నాకు తట్టనేలేదు. మీ శకుంతల మాటకేం గానీ, మా శారదకి ఈడూ జోడూగానే వుంటాడు. అమ్మ మొన్న నిష్ఠూరంగా నాన్నగారే వుంటే. దాని మెళ్లో ఈ పాటికి మూడు ముళ్ళూ పడకపోనా అని రాసింది. చూసేవుగా!" అన్నాడు శేషగిరి మంచం మీద నడుం వాలుస్తూ.

"బావుందండోయ్! మా చెల్లెలికని నేనంటూవుంటే మీ చెల్లెలి కంటూ రేమిటి? మా నాన్న పెద్దవాడయి పోయాడు మీకిచ్చిన కట్నం బాపతు అప్పు యింకా తీరలేదు. ఇక దీని పెళ్ళి ఎలా చేయగలనా అని బెంగపెట్టుకున్నాడు!" అంటూ పక్కనే మంచం మీద కూర్చుంది కామేశ్వరి.

"మీ నాన్న సంగతి ఆలోచిస్తున్నావు కానీ నా సంగతి చూడవేం? ఇప్పుడు కిరాణాకొట్లో సరుకుల్లాగే పెళ్ళికొడుకుల ధర కూడా రోజు రోజుకీ పెరిగిపోతోంది. సరుకులంటే కొనడం మానెయ్యగలం కాని, పెళ్లిచెయ్యటం ఎలా మానేస్తాం చెప్పు? ఈవిడైతే ఓవెయ్యి నూట పదహార్లు లాంఛనా లిస్తామంటే సంతోషంగా ఒప్పుకుంటుంది. నా బరువు తీరితే, నీ బరువు తీరినట్లు కాదా? కాముడూ! మీ నాన్న తిప్పలేవో మీ నాన్న పడతాడు. కానీ, మంచిరోజు చూసి, ఆవిడని కదుపుదూ!" అన్నాడు బతిమాలుతున్నట్లుగా.

కానీ కామేశ్వరి ఒప్పుకోలేదు. "అలా ఏం కుదరదు! మా చెల్లెల్ని తీసుకురమ్మని రేపే మా నాన్నకు ఉత్తరం రాసేస్తాను."

"అయితే! మా చెల్లెల్ని తీసుకురమ్మని మా అమ్మకి రేపే ఉత్తరం రాసేస్తాను!" అంటూ ఇద్దరూ కాసేపు వాదించుకుని, చివరికి ఇద్దర్నీ చూపించి, ఎవరు నచ్చితే వాళ్లనివ్వాలని ఓ ఒప్పందానికి వచ్చి పడుకున్నారు.

అదే సమయంలో సౌదామిని కిటికీలోంచి భాస్కరం గదివైపు చూసింది. భాస్కరం అప్పుడే బయటనుండి వచ్చాడు కాబోలు, పేంట్, షర్టు విప్పి లుంగీ, బనీను వేసుకుని ఆరుబయట నులకమంచం వాల్చుకుని ఆకాశం కేసి, చూస్తూ, పడుకున్నాడు. వెన్నెలలో అతని ముఖం మరింత అందంగా కనిపించింది సౌదామినికి. వాళ్ల వూరు కరణం గారబ్బాయి కానీ కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటానని వస్తే, 'నా సుఖం నేను చూసుకొనిపోతే, తమ్ముడిగతి, నీ గతీ ఏంకాను? తమ్ముడ్ని వాడి కాళ్లమీద వాడ్ని నిలబెట్టే వరకు పెళ్లి చేసుకోను" అంటూ ప్రగల్భాలు పలికింది.

"వయసులో వున్న పిల్లవు. అసలేరోజులు మంచివి కావు. అంత బస్తీలో ఒంటరిగా ఎలా వుంటావ్?" అంటూ తల్లి వద్దంటున్నా, పోట్లాడి, "ఎంటలోకి తమ్ముడి పరీక్షలైపోతాయ్ తరువాత మీరు వచ్చేద్దురు గాని ఈలోగా నేనేమీ అయిపోనులే." అంటూ బస్తీలో ఉద్యోగంలో చేరి, మూడు నెలలు అయిందో లేదో, సౌదామిని ఆ వయస్సులోని ప్రభావమేమో, కిటికీలోంచి అతన్ని అలా చూడగానే, వింత వింత ఊహలు కలిగి, రంగు రంగులకలల్లో తేలిపోవటం మొదలు పెట్టింది.

ఇంతలోనే అనసూయవచ్చి, "ఒరేయ్ భాస్కరం! అన్నం తిన్నావా? అంటూ అడగటం వినిపించింది. "లేదు" అంటూ అతను లోపలికి వెళ్ళాడు. కొంతసేపటికి అతను మళ్ళీ మంచంమీద పడుకుని, చుక్కల్ని లెక్క-



పెడుతున్నాడు. ఆమె కూడావచ్చి, మంచం ప్రక్కన చతికిలబడి, కొడుక్కి మెల్లగా ఏదో చెప్తోంది. అతను చుక్కల్ని లెక్కపెడ్తూనే వింటున్నాడు. ఆమె మాట్లాడుతూ, కళ్ళు తుడుచుకుంటూ వుండటం కనిపించింది, సౌదామినికి. కొంతసేపటి వరకు అలానే చూస్తూ, కిటికీ దగ్గర నిలబడ్డ సౌదామినికి కాళ్ళు పీకినట్లై, మంచంమీద వాలిందన్న మాటేగానీ, ఆలోచనలన్నీ అతనిమీదే వున్నాయి. "ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలో రిజిష్టర్ చేయించుకున్న నిరుద్యోగి అయి వుంటాడు. అందుకే ఆ తల్లి అలా బాధ పడ్తోంది. ఈ రోజుల్లో ఉత్తరమో, దక్షిణమో లేందే ఉద్యోగం దొరకదని తెలియదులా వుంది, పాపం! తను ఉద్యోగం కోసం ఎన్ని తిప్పలుపడింది? అతనిమీద అమాంతం జాలి పుట్టుకు వచ్చింది. తను పన్జేసే ఆఫీసులో ఏదో వేకెన్సీ ఉన్నట్లు వింది. ఆఫీసరు మంచివాడే! ఆయనతో చెప్పి, ఆ ఉద్యోగం అతనికి ఇప్పిస్తే ఆవిడ చాలా సంతోషిస్తుంది. ఆమె కష్టాలు కూడా గట్టెక్కుతాయ్! అప్పుడు తనంటే అతనికీ, ఆవిడకు కూడా మంచి అభిమానం ఏర్పడుతుంది. ఆ అభిమానం ప్రేమగానూ, తర్వాత పెళ్ళిగానూ ఎందుకు మారకూడదు? ఇద్దరం కలిసి ఆఫీసుకు వెడ్తే కొక్కిరాయి ముఖం సుబ్బారావు, ఆవకాయ డొక్కు కామేశ్వరరావు తెగ ఉడుక్కు చస్తారు. తను చేరినప్పటి నుంచి చూస్తోంది. వెధవ వెకిలి చేష్టలూ వాళ్ళూనూ! ప్రేమించారుట!...పెళ్ళి చేసుకోవాలిట వీళ్ళ ముఖాలికి అదొక్కటే తక్కువైంది!" ఆ క్షణంలోతల్లినీ, తమ్ముణ్ణీ, తన ప్రతిజ్ఞలని మరచిపోయి, రేపే ఆఫీసర్ను కలుసుకొని, వేకెన్సీ సంగతి అడగాలి అనుకుంటూ, నిద్రలోకి జారిపోయింది.

* * *

మర్నాడు సుబ్బమ్మగారు స్నానంచేస్తూ, అనసూయమ్మ పన్లోకి వెడ్తూవుండటంచూసి "అనసూయమ్మా! ఇక నీకీ తిప్పలు ఎన్నాళ్ళో వుండవులే! తెల్లవారేసరికి జడ్జీగారింటికి పోయి, వంటలు వండి రెక్కలు ముక్కలు చేసుకోనక్కర్లేదు. త్వరలోనే తాయారు మెళ్ళో భాస్కరంచేత మూడు ముళ్ళూ వేయించేస్తే, నా ఇంట్లోనే నాకూ నా బిడ్డకి ఇంత ఉడకేసి పడేసి, నువ్వింత తిని, ఓ మూల క్రిష్ణా రామా అనుకుంటూ కాలం

## మేడపందు

వెళ్ళబుచ్చమ్మ!" అనుకుంటూ కళ్ళతోనే సానుభూతిని ప్రకటిస్తూ, మనసులోనే అనసూయమ్మమీద బోలుడంత జాలిపడిపోవడం మొదలుపెట్టింది, సుబ్బమ్మగారు.

ఆరోజు వంట్లో నలతగా వుండి, ఆఫీసుకు శలవు పెట్టి, ఇంట్లోనే ఉన్న సౌదామిని మిట్టమధ్యాహ్నంవేళ భాస్కరం బయటనుండి రావటంచూసి, "ఉద్యోగంకోసం కాళ్ళు అరిగేలా మండుటెండలో ఎక్కడెక్కడ తిరుగుతున్నావో! ఎండలో తిరిగి తిరిగి, నీ ముఖం కందిపోవటం నేను చూడలేను భాస్కరం! రేపే ఆఫీసర్ను కలుసుకుని, ఆ ఉద్యోగం నీ కొచ్చేలా చూస్తాను!" అనుకుంటూ మనసులోనే జాలిపడుతూ,వాపోవటం మొదలు పెట్టింది. కామేశ్వరి వంటింట్లో పని పూర్తి




చేసుకుని, చంటిదాన్ని పక్కలో వేసుకుని, పడుకొని, "రేపే మంచిరోజు. అనసూయమ్మని కలుసుకొని, నాన్నకు శకుంతలను తీసుకురమ్మని ఉత్తరం రాయాలి!" అనుకుంది.

శేషగిరి ఆఫీసులో కూర్చుని "గుమాస్తాగాడిని, ఇంతకంటే మంచి సంబంధం ఎక్కడ నుండి తేగలను? అయినా ఈ రోజుల్లో ఎక్కడ చూసినా ఆడపిల్లల పుట్టేగదా! కన్ను పొడుచుకు చూసినా పెళ్లి కొడుకులు కనిపించటంలేదు. భగవంతుడి దయ వలన శారదకీ సంబంధం ఖాయమైతే నా బాధ్యతా తీరుతుందీ, అమ్మా సంతోషిస్తుంది." అనుకున్నాడు.

* * *

అసలే వేసవికాలం. ఆ రోజు ఎండ మరీ ఎక్కువగా వుందేమో రాత్రయినా వేడిగా ఒకటే ఉక్కపోతగా వుంది. సుబ్బమ్మగారు, తాయారు ఉక్కపోతకి ఒకటే అపసోపాలు పడుతూ, ఇంట్లో పడుకోలేక, బయట చప్టాలో మంచాలు వేసుకుని పడుకున్నా మధ్య మధ్య దోమలు చిటుకూ చిటుకూ కుడుతూవుంటే, నిద్ర పట్టక, మంచంమీద అటూ ఇటూ దొర్లుతున్నారు.

ఉన్న కాస్త చప్టాలోనే శేషగిరి మంచం వేసుకుని, ఆఫీసు పనితో అలసిపోవటం వలన అంత ఉక్కపోతలోనూ అప్పుడే నిద్రపోయేడు. ఆ ఉక్కపోతకి కామేశ్వరి పిల్లలిద్దరూ నిద్రపోకుండా, గుక్కపట్టి ఏడుస్తుంటే, సముదాయించలేక, సతమత మవుతూ. ఇక లాభం లేదని, గది తలుపు తెరిచి, గుమ్మానికి మధ్యస్థంగా సగం మంచం బయటికి, సగం మంచం లోపలికి వచ్చేలా గా ఆ కాస్త చోట్లోను మంచాన్ని ఎలాగో ఇరికించి విసనకర్రతో పిల్లలిద్దరికి విసురుతూ పడుకుంది.

భాస్కరం తన మామూలు చోట్లో నులక మంచం మీద పడుకుని మామూలుగా చుక్కల్ని లెక్కపెడుతున్నాడు. అనసూయమ్మ అతని ప్రక్కనే చాప పరుచుకొని, కొడుకుతో ఏదో మెల్లిగా మాట్లాడి, చాప మీద నడుం వాల్చింది. సౌదామిని పత్రిక పట్టుకుని, పేజీలు త్రిప్పుతూ మధ్య మధ్య కిటికీలోంచి భాస్కరం కేసి చూస్తూ,కొంతసేపటికిపత్రికతోనే విసురుకుంటూ మంచం మీదవాలింది.

* * *

ఓ నడిజాముదాకా ఎవ్వరికీ నిద్ర

(44వ పేజీ చూడండి)

## బ్యాలట్‌కై వేస్తున్న కథ



*(గత సంచిక తరువాయి)*

సుబ్బారావు నిర్ణయం విషయం శ్రీనివాస్ ద్వారా విని ప్రసూన చాలా బాధ పడింది. సూర్యనారాయణ కూడా నొచ్చుకున్నాడు. ఆ పైన అందరి పట్టుదల మీద ఒక బడి పంతులు కూతురితో సంబంధం నిశ్చయమైంది. అమ్మాయి పేరు కుసుమ. పద్దెనిమిదేళ్లుంటాయి సుమారుగా. ఇంటర్మీడియట్ సెకండియర్ చదువుతూంది. ఒక రోజు పెళ్లిచూపులు ఏర్పాటు చేశారు.

సుబ్బారావు, శ్రీనివాస్ వెళ్లారు. సుబ్బారావు ముందే చెప్పినట్టుగా అమ్మాయి తండ్రిని తీసుకుని బయటికి వెళ్లాడు శ్రీనివాస్. లోపల గది తలుపుకు చెవులుంచి వింటున్నారు ఇంట్లోవాళ్లు. గదిలో మాత్రం సుబ్బారావు, కుసుమ వున్నారు.

అడగవలసిన మామూలు ప్రశ్నలన్నీ అప్పటికే ఐపోయినాయి.

"చూడు. నీకు నేను నచ్చానా ?"

ఉలిక్కిపడి చూసింది కుసుమ.

"ఈ పెళ్లి నీ కిష్టమేనా ?"

మౌనంగా తలూపింది.

"నా గురించి నీకు తెలుసా ?"

మాట్లాడ్లేదు కుసుమ.

"నా కింతకు ముందే పెళ్లయింది తెలుసునా ?"

మళ్లీ తలూపిందా అమ్మాయి.

"నీపేరు కుసుమ అనుకుంటాను. చూడు కుసుమా. పెళ్లంటే జీవితానికిసంబంధించిన విషయం. ఇక్కడ బలవంతం ఏమీ లేదు. నువ్వు చెప్పవలసిందేమైనాఉంటే చెప్పు."

లోపలినుంచి వింటూన్న కుసుమ తల్లి గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి!

"ఏమీ లేదు" వినిపించనంత నెమ్మదిగా అంది కుసుమ.

'సరే,ఇంకాచదువుకోవాలనుకుంటున్నావా?'

"మీ యిష్టం".

"చదువుకోవలసింది నువ్వు. నాయిష్ట మేమీలేదు."

"నాన్నగారి నడుగుతాను."

"మళ్లీ మరొకరిమీద ఆధారపడుతున్నావు నీ యిష్టమేమిటో ముందు చెప్పు."

ఒక్క క్షణం ఆలోచించింది ఎందుకో.

"చదువుకుంటాను" అంది.

"సరే మంచిది ఇకనువ్వు లోపలికివెళ్లు" అంతటితో ముగిసి పోయింది.

* * *

వారం రోజుల్లో నిరాడంబరంగా పెళ్లి జరిగింది. వచ్చినవాళ్లు పాతికమందికన్నా ఎక్కువలేరు. అమ్మాయి తరఫు వాళ్ళు ఓ పది మంది, ప్రసూన, సూర్యనారాయణ, శ్రీనివాస్, మరి ఒకరిద్దరు సుబ్బారావు స్నేహితులు వచ్చారు. అరగంటలో పెళ్లి తంతు ముగిసింది. కుసుమ కాలేజీకి వెళ్ళిపోయింది. సుబ్బారావూ కోర్టుకు వెళ్లాడు.

మరనాడు చెల్లెల్ని తీసుకుని సుబ్బారావు దగ్గర కొచ్చింది కుసుమ, బట్టలు, పుస్తకాలతో. చెల్లెల్ని పంపించేసింది. వంట చేసుకుంటున్న సుబ్బారావు చేతిలోంచి గరిట తీసుకుంది.

"ఆ అమ్మాయినిప్పుడే పంపించాల్సింది కాదు" మళ్లీ అన్నాడు సుబ్బారావు.

**జరిగిన కథ 2 : సుబ్బారావు** ప్లీడరు గుమాస్తాయే అయినా పేరున్న రచయిత. పెళ్లాం పరాయి మగాడితో సంబంధం పెట్టుకోటానికి మొగుడు కూడా కారకుడే కాబట్టి అతను ఆమెని శిక్షించటం నేరమనే సుబ్బారావు మనస్తత్వం భార్య ప్రసూనను ఆశ్చర్యపరుస్తుంది. తనతో తృప్తి పొందలేక చిన్ననాడు కలిసి చదువుకొన్న సూర్యనారాయణతో సంబంధం పెట్టుకున్న ప్రసూనకు విడాకులిచ్చి అతనితోనె వివాహం జరిపిస్తాడు సుబ్బారావు. స్నేహితుడు శ్రీనివాస్, ప్రసూనలు బలవంతంమీద మళ్లీ పెళ్లికి సుబ్బారావుని ఒప్పిస్తారు.

"ఫర్వాలేదులెండి. దానికి స్కూలుకి టైమవుతూంది."

"కూరగాయలు తరుగుతాన్నేను. కాస్త ఆ అన్నం సంగతి చూడు."

"అన్నీ నేను చూసుకుంటాను. మీరు వెళ్లండి."

"నాకు వేరే పనేమీ లేదు..."

"ఫర్వాలేదు నేను చూసుకుంటాను."

"సరే. నీ యిష్టం" వెళ్ళిపోయాడు.

వంటయినాక వడ్డించి పిలిచింది. స్నానం చేసి పేపర్ చదువుకుంటున్నాడు సుబ్బారావు. కుసుమ పిలుపువిని లోపలికి వెళ్లాడు.

"నువ్వూ వడ్డించుకో" అన్నాడు కూచుంటూ.

మౌనంగా వడ్డించుకుంది మరో ప్లేట్లో.

"చూడు, యిది నీ యిల్లు. ఇక్కడ నువ్వు మొహమాట పడవలసిన విషయాలేమీ లేవు. నీకేం కావలసినా నన్నడుగు" భోజనం చేస్తూ అన్నాడు.

"అలాగే" అంది.

భోజనం ఐపోయింది; సుబ్బారావు అలవాటుగా పళ్ళెంతీయబోయాడు.

"ఉండనీయండి" ఎడమ చేయితో అతని చేతిని ఆపుతూ వారించింది కుసుమ.

తొమ్మిదిన్నరకు ఒక గంట కొట్టింది గడియారం.

"నీకు కాలేజీకి టైమవుతున్నట్టుంది. నేను పదిన్నరకు వెడతాను" అన్నాడు, గడియారం వంక చూస్తున్న కుసుమతో.

పుస్తకాలు తీసుకుంది ఒక తాళం చెవి తీసిచ్చాడు.

"నేను వచ్చేసరికి ఆలస్యమవుతుంది. ఇది నీదగ్గరుంచుకో"

మౌనంగా అందుకుంది.

"బస్సుకూ, దానికీ నీకు అవసరముంటాయి. నీదగ్గరుంచుకో" అన్నాడు పదిరూపాయల నోటు అందిస్తూ.

కుసుమ తీసుకోలేదు.

"నాకు పాస్ వుంది" అంది.

"అది మీ యింటి దగ్గరనుండి వుండుంటుంది. ఐనా మధ్యాహ్నం నువ్వు రావటానికి వీలవ దనుకుంటాను, భోజనానికి. చూడు, నీకు యింతకు ముందే చెప్పాను—ఇది మనిల్లని. నిజానికి నువ్వు నన్నడగకుండా తీసుకోవలసింది" నవ్వుతూ అన్నాడు.

సిగ్గుపడుతూ తీసుకుంది కుసుమ.

"వెళ్లొస్తాను" అంది వెడుతూ.

ఆ అమ్మాయికి సుబ్బారావు చాలా విచిత్రంగా కనిపించాడు.

పదిన్నరకు సుబ్బారావు వెళ్లిపోయాడు.

* * *

సాయంత్రం సుబ్బారావు వచ్చేసరికి వంట ముగించి ఏదో నోట్సు రాసుకుంటూ కూచుంది కుసుమ. పెళ్లినాడు తీసిన ఫోటోలు, మల్లెపూలు తీసుకొచ్చాడు.

ఎందుకో కుసుమ ముఖం వాడిపోయింది. సుబ్బారావు మాత్రం గమనించలేదు. మల్లెపూలు జడలో పెట్టబోయాడు. సున్నితంగా చేతిలోకి తీసుకుని తనే పెట్టుకుంది. ఆరోజు సుబ్బారావు ఆశించినట్టు మాత్రం జరగలేదు. ఇంకా కొత్తకనుక సిగ్గేమో ననుకున్నాడు. ఐతే మరునాడు కూడా తెలివిగా తప్పించుకుంది. అలాగే మూడు నాలుగురోజులు జరిగింది. సుబ్బారావుకు అంతుపట్టలేదు. తనమీద యిష్టం లేదనుకోవటానికి అవకాశంలేదు. మరి రాత్రిళ్లు ఎందుకు దూరంగా వెడుతుంది? చిన్నపిల్ల అనుకోవటానికీ వీల్లేదు. ఇలాంటివిషయాలు తెలియకుండా వుంటాయనుకోవటానికీ లేదు. కాలేజీలో చదువుకుంటూంది. ఏవీ అర్థం కాలేదు.

తనతో ప్రసూన ఎంత బాధపడి వుంటుందో ననిపించింది అతడికి.

ఒకరోజు సినిమాకి తీసికెళ్ళాడు. అయిష్టంగానే బయలుదేరింది. 'పారిస్ ఐ లవ్ యూ' సినిమా అది.

"ఈ సినిమాకా? నాకు యింగ్లీష్ అర్థం కాదు." అంది, అందులో ఏముంటుందో తెలిసి.

"ఫర్వాలేదు. నాక్కూడా అంతగా రాదు" అన్నాడు. అసలు సంగతి, అందులో ఏముంటుందో అతనికీ తెలుసు. అందుకే




ఆమెను తీసికెళ్ళాడు, ఆరోజు ప్రత్యేకంగా.

సినిమా అంతసేపూ కుసుమను గమనిస్తూనే వున్నాడు సుబ్బారావు. ఒక్కొక్క సన్నివేశంలో సహజంగానే ఉద్రేక పడుతూంది. 'ఈ అమ్మాయిలో కోరికల్లేవంటే ఎలా నమ్మేది'— అనుకున్నాడు. బహుశా సిగ్గుపడి

వుంటుం దనుకున్నాడు. ఇద్దరూ రిక్షాలో యింటికి వెళ్ళారు. కానీ ఆ రోజు కూడా మౌనంగా పోయింది సుబ్బారావు నిగ్రహించుకునే స్థితిలో లేదు. చెయ్యిపట్టుకుని ఆపాడు కుసుమని.

"కుసుమా, నిజంచెప్పు నేనంటే నీకిష్టం లేదా?" అన్నాడు.

మాట్లాడ్లేదు కుసుమ.

"మరి?"

"నాకిష్టంలేదు" అంది, తలవంచుకుని.

"అబద్ధం. నేన్నమ్మను." ఆవేశంగా అన్నాడు.

"నిజం. నన్ను నమ్మండి" దాదాపు ఏడుస్తూ అంది.

ఒక్కసారి అతనిలోని ఆవేశం తగ్గిపోయింది.

"పోనీలే. నీకిష్టం లేకుంటే నేను బలవంత పెట్టను. పడుకో" శాంతంగా అన్నాడు.

పళ్ళతో కింది పెదవిని నొక్కిపడుతూ, పొంగివస్తూన్న దుఃఖాన్ని ఆపుకుంటూంది అమ్మాయి.

"ఐమావ్ సారీ! నేను బయటికి వెడుతున్నాను. తలుపేసుకో" అన్నాడు తలుపు తీస్తూ.

తలుపు దగ్గరగా వెళ్ళింది కుసుమ.

"నా కోసం ఎదురు చూడకు. నేను ఉదయం వస్తాను ఒక స్నేహితుణ్ని రైలెక్కించి రావాలి" జేబులో డబ్బులు



తడుముకుంటూ వెళ్ళిపోయాడు.

అతడెక్కడికి వెడుతున్నాడో తెలుసుకుంది. తలుపు గొళ్ళెం వేసింది. మంచం మీద వాలిపోయింది. ఆపుకుంటూన్న దుఃఖం కట్టలు తెంచుకుంది. తడిసిపోవటం మామూలయినా, తలగడాకు—అసలు మనుషులెందుకేడుస్తారో అర్థం కాలేదు.

*       *       *

రెండురోజులు గడిచిపోయింది. మళ్ళీ మామూలు వాతావరణం ఏర్పడింది. సుబ్బారావు, కుసుమ దగ్గరగా వెళ్ళలేదు ఆ రెండు రాత్రులూ. ఆ రోజు మామూలుగా కాలేజీకి వెళ్ళింది కుసుమ. సుబ్బారావు కోర్టులో కేసులేవీ లేకపోవటంతో మూడు గంటలకే యింటికి వచ్చేశాడు. తలుపు తీస్తుండగా తలుపు క్రింద కవర్ కనిపించింది. తీసి చూశాడు. కుసుమకు ఎవరో స్నేహితురాలు రాసి వుంటుంది. టేబిల్ పైన పడేశాడు

బట్టలు మార్చుకుని ముఖం కడుక్కున్నాడు ఏదో రాసుకోవాలని పెన్ను తీశాడు. అంతలో ఏదో అనిపించింది. ఆడపిల్లలు, కొత్తగా పెళ్ళయిన స్నేహితురాలికి ఏమని రాస్తారు? కాపురం ఎలా వుందనీ, భర్త ప్రవర్తన యెలా వుంటుందనీ, పెళ్ళయినాక కనిపిస్తున్న కొత్తదనాలేమిటనీ — యిలాగే వుంటాయి విషయాలు.

చదివి కుసుమనో ఆట పట్టించవచ్చు. అందులో తనకు 'మెలు చెసనెనైనా' వుంటే అవి చూపించవచ్చు. తనకూ పంచిది. ఇలా ఆలోచిస్తూనే కవర్ చించాడు.

"ప్రియమైన కుసుమకు,

నువ్వు రాసిన లెటర్ చేరింది. వెంటనే నువ్వు రాయమన్నట్టుగానే ఈ అడ్రసుకే రాస్తున్నాను."

నవ్వుకున్నాడు సుబ్బారావు. "అప్పుడే స్నేహితురాళ్లకు ఉత్తరాలు రాసి, అందులో ఈ అడ్రసు యిచ్చిందన్నమాట" అనుకున్నాడు.

"నువ్వు రాసిన విషయాలుచూసి నవ్వాలో ఏడవాలో తెలియటం లేదు"

"బహుశా 'అదే' విషయం రాసిఉంటుంది ఈ అమ్మాయి పెళ్ళయినదేమో" అనుకున్నాడు.

"నీ పెళ్ళి విషయమై నువ్వు నాకురాసిన వుత్తరం నీపెళ్ళి జరిగే రోజున చేరింది. ఎప్పుడు చేరితేమాత్రం చేయగలిగిందేమిలేదు. ఆ రోజంతా కుళ్ళి కుళ్ళి ఏడ్చాను. నా బాధ ఎవరితో చెప్పుకోగలను? అమ్మా, నాన్నా కూడా బాధపడ్డారు. నిజానికి ఎవరేంచేసినా, ఇక ప్రపంచంలో నా అంత దురదృష్టవంతుడుండడు."

అప్పటికే అందులోని విషయాలు ఆత్రుతగా చదువుతున్నవాడు సడన్‌గా ఆగిపోయాడు వెంటనే చివరిపేజీ తీసి క్రింద సంతకం చూశాడు. 'ప్రభాకర్' అని వుంది. ఒక్కసారి భృకుటిముడి పడింది. అక్షరాల వెంట వేగంగా పరుగెత్తాయి కళ్ళు.

"కుసుమా, నా మీద ఎంత కోపం చూపించినా, మేమంటే ఎంత విరోధం ఏర్పడినా మావయ్య యింతపని చేస్తాడని మాత్రం నేనూహించలేదు. పైగా పెళ్ళాం వదిలిపెట్టినవాడికి నిన్నిచ్చి పెళ్ళి చేస్తాడని నేనూహించలేదు.

ఇప్పుడేం చేయాలో నాకు పాలుపోవటం లేదు. ఇన్నాళ్ళ నిన్ను రహస్యంగానైనా పెళ్ళి చేసుకోవచ్చు ననుకున్నాను చేతులు కాలినాక ఆకులుపట్టుకుని ఏం ప్రయోజనం. ప్రస్తుతం ఏం చెయ్యాలన్నా నువ్వు మరొకరి భార్యవు. చట్టం, న్యాయం అంటూ మనకు మధ్య ఇనుపగోడలు. వాటికి భయపడి కాదు, కానీ ఏం చేసినా అవి మనను కలవనీయవు. విడదీస్తూనే వుంటాయి.

కుసుమా, మనసు చంపుకోమని నేనను.

ఎక్కడో ఉరిమితే 'పిలిచావా' అంటారేమిటి?!



# మజ్దా ఇంటియందున్నప్పుడు...





## ప్రకాశవంతముగా పని చేయును, దీర్ఘ కాలము శ్రమించును.

మజ్దా మీ యింటిలోనికి వచ్చినప్పుడు, మీకు తప్పక పటిష్ట మైన మూడు లాభములు కలుగునట్లు చేయును—

మొదట సరియైన వాట్టేజి మరియు ఎక్కువ ప్రకాశవంతమైన కాంతి కలుగుట. రెండవది ఎక్కువ ఎలక్ట్రిసిటి యూనిట్లను ఖర్చుచెయ్యదు. మూడవది మీరు సహజముగా అనుకొన్న దాని కన్నా ఎక్కువ కాలమున్నను (మీకు ఆశ్చర్యము కలుగును)

వీటన్నిటి వెనుక—మజ్దా యొక్క సరియైన లోప రహితమైన తయారీ తప్పులకు తావియ్యదు.

మజ్దా ల్యాంప్ కంపెని లిమిటెడ్

**అధిక కాంతికి,**
**ఎక్కువ జీవనముకు**
**అది తప్పక**
# మజ్దా

THORN గ్రేట్ బ్రిటన్ థరన్ గ్రూప్ యొక్క ఒక సభ్యులు

MLC-198 TEL

## ఇంటింటి చిట్కాలు

పంతంగి రవీంద్ర శ్రీనివాస్

★ కొమ్మజారీలలోపల తుప్పు పట్టకుండా ఉండటానికి నత్తగుల్ల పడవేస్తే అది నీటిలోవుండే చిన్న చిన్న దుమ్ముకణాల్ని ఆకర్షించి తుప్పు పట్టేట్టు చేయదు.

★ కోడిగ్రుడ్ల, యితర గ్రుడ్లవల్ల చెంచాలపై మరకలవుతే శుభ్రపరచ డానికి ఉపాయముంది. గ్రుడ్లని మరిగించిన నీటిలోనే చెంచాలని కాసేపు ఉంచితే, వేరే చెంచాలని కడగ నక్కర్లేదు.

★ మామూలు గోడలకి మేకులు కొట్టేటప్పుడు గోడబెల్లులు ఊడిపోకుండా 'సెల్లోఫీన్' లాంటి అతికేటేపు గోడపై 'ఇంటు' మార్కులా అతికించి మరీ మేకు కొట్టాలి. తర్వాత టేపు తీసేయవచ్చు.

★ పచ్చిమిరపకాయలు వేయించు తున్నప్పుడు టపటపలాడి గింజలు విచ్చుకొని పడకుండా రెండుమూడుచోట్ల మిరపకాయల్ని చిదిపి కాయసగంగా పడవేస్తే సరి.

★ కర్ర సామానులమీద, నేలపైన మంచు కురిసినట్లు చెమ్మపడుతూ ఉంటుంది. లీటరు నీటిలో చెంచాడు కడిగేసోడా కలిపి కడగండి. తర్వాత శుభ్రమైన నీటితో మరోసారి కడిగి ఆ నేలని ఆరబెడితే మంచిది.

తరువాతి దీపావళి సీరియల్ కథ

**పరిధి**

పరిస్థితులు మారలేనప్పుడు మరచిపోవటమే మంచిది. నిన్ను నేను మరువలేకపోవచ్చు. కానీ నాకోసం, కనీసం నువ్వయినా సుఖపడటం కోసం నువ్వు నన్ను మరిచిపో, మీ ఆయన పేరున్న రచయిత. చదువుకున్నవాడు. ఆదర్శాలున్నవాడు. అందుకే నాకన్నా ఆయనే నీకు తగినవాడనుకుని వుంటాడు మామయ్య. మన మమతలు చంపుకున్నా పదిమంది తృప్తి పడగలిగితే అదైనా చాలు. ఆయన నిన్ను బాగానే చూసుకుంటున్నా డంటున్నావు. మరి ఎంత కాలంఅతనికి దూరంగావుంటూ కాలం గడుపుతావు. పరిస్థితులతో రాజీ పడటం కంటే మనమేం చేయగలం? మాసిపోని గాయాలకు కాలమే మందు. మారలేని మనసుకు మరుపే శరణ్యం. ఇది గుర్తుంచుకో.

నీ క్షేమం కోరే

బావ

—ప్రభాకర్"

ఉత్తరం మడిచి కవర్లో పెట్టేశాడు. కవరు జేబులో పెట్టుకున్నాడు. భారంగా వాలుకుర్చీలో కూర్చుండి పోయాడు. అతడి మనస్సులో ఏభావముందో చెప్పటం మాత్రం కష్టం. మనస్సును సంభాళించుకోలేని పరిస్థితిలో వున్నాడని మాత్రం చెప్పొచ్చు. తలుపు తాళం వేసి బయటకి వెళ్ళిపోయాడు.

*　　*　　*

రాత్రి పన్నెండు కావస్తూంది. కృష్ణ ఒడ్డున భారంగా అడుగులేస్తూ నడుస్తున్నాడు సుబ్బారావు. లోలోపల ప్రశాంతతతో

### రాదారి పడవ

పైకి మాత్రం ఎగిసిపడుతూ కల్లోలంగా కనిపిస్తూంది కృష్ణ. పైకి గంభీరంగా కనిపిస్తూన్నా, సుబ్బారావు హృదయం మాత్రం అల్లకల్లోలంగా వుంది. అయితే అతని ఆవేదనకు కారణం తను రెండోసారి మోసపోయాడని కాదు. లోకంలో అయిష్టమయిన జీవితాలు సాగిస్తున్నవాళ్ల పట్ల సానుభూతి, వాళ్ల జీవితాల్లోని వేదనకు బాధ. సంఘంలోని దురాచారాలపట్ల జాలి, మనుషుల స్వభావాలపట్ల విచారమూ కలిపి అతన్ని కల్లోలపరుస్తున్నాయి. ఇసుకలో స్పష్టంగా పడినట్లే పడి పొరలి వస్తున్న నది పొంగులకు రూపుమాసి పోతున్నాయి అతని అడుగులు ఆ అడుగు జాడల్ని నది చెదర గొడుతోందో లేక తనలో దాచుకుంటోందో మరి!

ఇంటివైపు దారితీశాడు.

"కుసుమా" పిలిచాడు. సమాధానం వినిపించలేదు.

పదకొండు గంటలదాకా అతడి కోసం చూసి పడుకుంది కుసుమ. తలుపు తీసేసరికి చాలాసేపయింది.

"బాగా నిదరొచ్చిందండీ" సిగ్గుపడుతూ అంది కుసుమ

"ఫర్వాలేదు, పడుకో" ప్రశాంతంగా అన్నాడు.

"భోజనం..."

"ఒక స్నేహితుడింట్లో చేశాను" ఆమె మాట పూర్తికాకముందే అన్నాడు.

కుసుమ పడుకుంది. వాలుకుర్చీలో కూచుని ఆలోచిస్తూ సుబ్బారావు అలాగే నిద్దరలోకి జారుకున్నాడు.

*　　*　　*

ప్రసూన దూరమైనప్పటినుండీ బెడ్‌కాఫీ అలవాటూ దూరమైంది సుబ్బారావుకి. కుసుమకన్నా ముందే మెలుకువొచ్చింది. లేచి స్నానం అవీ కానిచ్చి కాఫీ కాచాడు. అప్పుడే కుసుమకి మెలుకువొచ్చింది. కప్పులో కాఫీ పోసుకుంటున్న సుబ్బారావుని చూసి.

"అరరె... నన్ను నిద్రలేపి వుండాల్సింది" అంది నొచ్చుకుంటూ.

"ఫర్వాలేదు. అవసరమైన పనిమీద ఒకపూరెళ్ళాల్సి వుండటంతో నేనే ముందు లేచాను."

'ఏవూరు' అని కుసుమ అడగలేదు. అతడు చెప్పనూ లేదు.

"కాఫీ యింకావుంది. ఫ్లాస్కులో పోస్తున్నాను" అన్నాడు పెరట్లోకి వెడుతున్న కుసుమతో.

ఎందుకో ఒకక్షణం సిగ్గుపడింది కుసుమ. ఆపైన తనేదో తప్పుచేస్తున్నట్టు యించుక బాధపడింది.

మరో పదినిమిషాల్లో సుబ్బారావు కుసుమతో చెప్పి బయటికి వెళ్ళాడు, జేబులో ఉత్తరం తడుముకుంటూ.

(ఇంకావుంది)

శ్రీ గౌతమ్ పిక్చర్స్ వారి

# ఈ కాలం దంపతులు

(శ్రీమతి కావిలిపాటి విజయలక్ష్మి
అపశ్రుతులు నవల ఆధారంగా)

నిర్మాత యస్. రామబ్రహ్మం

దర్శకుడు: డి. యోగానంద్

నైజాం: యస్. యస్. వి. పి.
సీడెడ్: విజయా.

గౌతమ్ పిక్చర్స్ వారి



# వారఫలం

మహేష్

12–12–1975 శుక్రవారం మొదలు
18–12–1975 గురువారం వరకు

**మేషం :—** మీ కార్యక్రమాల్లో వ్యతిరేకత యేర్పడుతుంది. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**వృషభం :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మిధునం:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం ఆఖరులో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

**కర్కాటకం:—** అనుకూలమైన వార్తలను వింటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం :—** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రాగలదు. వ్యాపారంలో చికాకులు ఏర్పడతాయి. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది.

**కన్య :—** రావలసిన డబ్బు అందుతుంది. ప్రయాణాలు ఫలించగలవు. వారం మధ్యలో వ్యతిరేక పరిస్థితి ఏర్పడుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో వృత్తిలో ఆదాయం బాగుంటుంది. మిత్రులకుసహాయంచేస్తారు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

## రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్......

జ్వర పీడితుడా!
నీలో ఎంత ఉష్ణం పెరిగినా
నిన్నది చలినుంచి కాపాడలేదు!
నీలోని దురహంకార గర్వాలు సైతం
అజ్ఞానంనుంచి నిన్ను రక్షించలేవు!

**తుల :—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. సాటివారితో మాట పట్టింపులుతగవు మీ ఆలోచనలు ఫలిస్తాయి. వ్యాపారంలోముఖ్యమైన వ్యక్తులను కల్పుకొంటారు. వారం ఆఖరులో ప్రయోజనంలేని శ్రమ కలుగుతుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం —** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి ఇతరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. వారం ఆఖరులో ఆర్థికవ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు:—** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**మకరం :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు —వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కుంభం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగాఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యంబాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**మీనం :—** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధు మిత్రులను కల్పుకొంటారు.

సీరియల్

# శ్రావణసంధ్య

తెళ్ళాపు నాగేశ్వరావు

(గత సంచిక తరువాయి)

ఒక రోజు సాయంత్రం ఆరున్నర గంటలకు రాజారాం వచ్చాడు శాంతి ఇంటికి. అప్పటికి ఇంకా శాంతి ఇంటికి రాలేదు. రాంమ్మోహన్‌కు రెండు త్రీ ఫైవ్స్ ప్యాకట్లూ, నీలిమకు ఒక బిస్కెట్ ప్యాకెట్టూ తెచ్చాడు.

"మా ఇంటి కొచ్చినప్పుడల్లా శ్రమ దండుగే గాకుండా, ఈ ఖర్చులు కూడా దేనికండీ!" అన్నాడు రాంమ్మోహన్.

"ఆదేమిటండీ! నేను రోజూ పెట్టే ఖర్చుల్లో ఇదో లెక్కా, జమా! నిన్న రేసెస్‌లో పదిహేను వందలు పోయినాయి. ఇవాళ మధ్యాహ్నం పేకాటలో వెయ్యి రూపాయలు పోయాయి. అసలు ఓ స్కాచ్ బాటిల్ తెద్దామనుకున్నాను మీ కోసం. హోటల్లోనే వుంది. కాని శాంతి మనస్సు బాధ పడుతుందని తీసుకురాలేదు. అన్నట్టు శాంతి ఏదీ!" అన్నాడు రాజారాం.

"ఇంకా ఆఫీసు నుంచి రాలేదు."

"ఉద్యోగంలో చేరిందా? ఏ ఆఫీసు?"

"నేను ఇదివరకు పని చేసిన కంపెనీయే. నేను ఉత్తరం వ్రాసి యిస్తే, ఎం. డి. ఉద్యోగ మిచ్చాడు. పర్సనల్ ఆసిస్టెంటుగా వేసుకున్నాడు. ఏవో బోర్డు మీటింగులూ, అవీ వుంటాయిగా – ఒక్కో రోజు ఇంటికి రావటం లేటు అవుతూవుంటుంది."

"అవును మరి. పి. ఏ. అంటే టైమింగ్స్ నిచ్చితంగా వుండవు. ఒక్కోసారి రాత్రి పది అయినా వుండిపోవాల్సిందే! తప్పదు. ఆ ఉద్యోగం లక్షణమే అంత!"

"ఈ కష్టకాలంలో ఏదో ఒక ఉద్యోగం దొరికింది. అదే పది వేలు. ఇప్పుడిప్పుడే పరిస్థితులు ఆర్థికంగా మెరుగు పడుతున్నాయ్."

"కాదు మరీ! ఆ ఆఫీసులో ఇదివరకు నా స్నేహితుని భార్య 'జ్యోతి' పి ఏగా ఉంటూ ఉండేది ఇప్పుడు సెక్షన్ మారివుంటుంది. అప్పుడప్పుడూ వాడింట్లో పేకాట ఆడుతూ వుండేవాళ్లం. ఆమె కూడా మాతోపాటు ఆడుతూ వుండేది."

ఓ గంటసేపు ఆ కబురూ, ఈ కబురూ చెప్పి వెళ్లిపోయాడు రాజారాం. అతను వెళ్లిన అరగంట పిమ్మట శాంతి ఇంటికి వచ్చింది. రాజారాం వచ్చి వెళ్లాడని చెప్పాడు రాంమ్మోహన్. 'ఇంకా వాడి మనస్సు ఈ ఇంటి చుట్టూనే తిరుగుతూం దన్నమాట' అనుకుంది శాంతి.

కాని వాళ్ల ఆఫీసులో ఇదివరకు ఎం. డి. కి పి. ఏ. గా ఉన్న జ్యోతి అతనికి తెలుసునన్న విషయం రాంమ్మోహన్ చెప్పగా – ఆమె మనస్సు గిలగిల తన్నుకొంది తుమ్మముల్లు గుచ్చుకున్నట్టుగా.

## 23

క్రమేణా అవిటివాని జీవితానికి, పగటి పూట ఒంటరిగా గడపటానికి రాంమ్మోహన్ అలవాటు పడిపోయినాడు. శాంతికి ఉద్యోగం వచ్చిన తర్వాత ఆర్థిక ఇబ్బందులూ, చీకాకులూ, భయాలూ తగ్గిపోయినాయి. సిగిరెట్లకు పుష్కలంగా డబ్బు లభిస్తున్నది. వెంకటరత్నానికి అడ్డంగా వుండి, నెత్తిన వేసుకొని, గొంతుమీదకు తెచ్చుకొన్న బాకీని కూడా శాంతి తీర్చివేసింది. – ఆఫీసులో లోన్ తీసుకొని దగ్గర్లో వున్న 'స్పీక్‌వెల్' ఇంగ్లీషు మీడియమ్ కాన్వెంట్‌కు నీలిమ వెళుతోంది.

మానవుని ఆర్థిక పరిస్థితికీ, మన స్థితికీ అవినాభావ సంబంధ మున్నది. రెండూ పరస్పరం ఒకదానిపై మరొకటి ఆధారపడి వుంటాయి. ఆర్థిక పరిస్థితి బాగా వున్నప్పుడు మానవుడు జీవితంలో ఎక్కువ సంతోషంగా, సంతృప్తిగా, స్థిమితంగా, భద్రతగా, ఆశాజీవిగా వుంటాడు. ఆర్థిక పరిస్థితి హీనంగా వున్నప్పుడు మానవుడు జీవితంలో విచారంగా, అసంతృప్తిగా, భద్రతలేని వానిగా, నిరాశా జీవిగా, చీకాకుగా వుంటాడు. ఆర్థిక పరిస్థితి మెరుగు కావటంతో రాంమ్మోహన్ మన స్థితి కూడా మెరుగైంది. ఇప్పుడతనికి బ్రతుకు అంత దీనంగానూ, భవిష్యత్తు అంత భయంకరంగానూ కనబడటంలేదు. శాంతి దేవతగా, సంసారాన్ని చక్కదిద్దుకొనే ఉత్తమ ఇల్లాలుగా, ఎంతటి కష్టాలనైనా ధైర్యంగా ఎదుర్కొనే సమర్థవంతురాలిగా అతనికి కనబడుతోంది. అందువల్లనే ఆమె పట్ల తన వైఖరిని పూర్తిగా మార్చుకొన్నాడు. ఆమెమీద విసుక్కోవడంలేదు; కోపాన్ని ప్రకటించడం లేదు; వ్యగ్యంగా వ్యాఖ్యానించడంలేదు; నిష్కారణంగా అలగడంలేదు. పైపెచ్చు ప్రేమగా, లాలనగా, మర్యాదగా, అణకువగా, గౌరవంగా మాట్లాడుతున్నాడు.

ఆ నెల మొదటి తేదీన జీతం రాగానే, "శాంతీ! రెండు మంచి చీరలు కొనుక్కో!" అని రాంమ్మోహన్ సంహా యిచ్చాడు.

"ఆం! నాకు దేనికీ! ఇదివరలో వున్నవి చాలు. ఇంకా రెండు మూడు ఏళ్లదాకా వస్తాయి" అంది శాంతి.

"ఆ పాతచీరల్ని ఎన్నాళ్ల ధరిస్తావు? ఉద్యోగాలు చేసే స్త్రీలు రోజుకో రకం చీర కడుతూ వుంటారు -- తమ ఆర్థిక స్థితి ఎలా ఉన్నప్పటికీ. లేకపోతే లోకం దృష్టిలో పల్చనైపోతారు. నువ్వూ అప్పుడప్పుడూ లేటెస్ట్ ప్యాషన్ చీరలు కొనుక్కుంటూ వుండు" అన్నాడు రాంమ్మోహన్.

ఆయన ప్రోత్సాహమూ, ప్రోద్బలం మీదనే ఆ నెల జీతంలో రెండు చీరలు కొనుక్కుంది శాంతి. ఒకటి లేపాక్షి కాటన్ శారీ, రెండోది పెద్ద బోర్డర్ గల వినాన్ శారీ.

ఆరోజు ఆఫీసు కెళుతూ కాఫర్ సల్ఫేట్ కలర్‌మీద, మెరూన్ కలర్ ఫ్లవర్స్ బోర్డర్ గల చినాన్ చీరను ధరించింది శాంతి. ఆ చీరలో ఆమె ఎంతో అందంగా, ఆకర్షణీయంగా కనబడింది రాంమ్మోహన్‌కు. భార్యచేత ఆరోజు సెలవు పెట్టించి, పగలంతా కౌగిలించుకొని పడుకొంటే ఎంత బావుండు? అనిపించింది, కోర్కెలు రేగిన అతని మనస్సుకు కాని అంత సాహసం చేయలేకపోయాడు

"ఈ చీరలో ఎంత బావున్నావు, శాంతీ!" అన్నాడు రాంమ్మోహన్ ఆమె ఆఫీసుకు వెళ్లబోతూండగా ఓ నిముషంపాటు అదేపనిగా ఆమెకేసి చూశాడు.

శాంతి మనస్సు పుటుక్కుమంది – దారం తెగినట్టు.

"ఆఫీసునుంచి నేరుగా యింటికొస్తావుగా!"

"ఊం!" అని మూలిగి చకచకా వెళ్లింది శాంతి టైం అయిందన్నట్టు.

ఆ రోజుల్లో ఆమె ఎప్పుడు కొత్త చీర

**జరిగిన కథ 8:** ప్రేమించి పెళ్లి చేసుకున్న శాంతి, రాంమ్మోహన్‌ల అనురాగ ఫలం నీలిమ. వారు ఎంతో వైభవంగా తమ ఏడవ వెడ్డింగ్ యానివర్సరీ జరుపుకుంటారు. శాంతి బావ రాజారావ్ వచ్చి వెళుతుంటాడు. స్కూటర్ ప్రమాదంలో కాలు, చేయి పోగొట్టుకుంటాడు రాంమ్మోహన్. ఆర్థిక యిబ్బందుల్లోకూడా పూర్వంలాగా జరగాలనే రాంమ్మోహన్ మనస్తత్వం శాంతిని బాధిస్తుంది రాంమ్మోహన్‌కు తిరిగి త్రాగుడు అలవాటు చేస్తున్న రాజారావ్‌ని అవమానించి పంపుతుంది శాంతి. రాంమ్మోహన్ పని చేసిన కంపెనీలోనే ఉద్యోగం సంపాదిస్తుంది శాంతి. ఉద్యోగం కంటిన్యూ కావాలంటే తన శీలాన్ని అర్పించమన్న మానేజింగ్ డైరెక్టర్ రఘునాథ్ అంటే అసహ్యించుకుంటుంది శాంతి. దారిద్ర్యంతో బాధపడటమో లేక దాన్నుంచి తప్పించుకోటానికి నైతికంగా దిగజారిపోవటమో తేల్చుకోలేకపోతోంది శాంతి. రఘునాథ్‌కి పర్సనల్ అసిస్టెంట్‌గా తన స్థానంలో స్థిరపడ్డ శాంతిని ఆ ఆఫీసులోంచి పంపేయాలనుకుంటుంది జ్యోతి.

ంచినా, ఆ చీరను నలిపేవరకూ తాను వూరు నేవాడు కాదు. సినిమాకు వెళదామని ప్రోగ్రాం ుకోవడమూ, ఆ సందర్భంగా ఆమె కొత్త చీర ంచడమూ, తనలో కోర్కె నులివెచ్చగా రేకెత్తు ూ, అంతే! ఏ పేరంటానికో, శుభకార్యానికో వెళ్ల నికి ఆమె ఏ బెనారస్ పట్టుచీరో కట్టుకొంటే , తనలో వాంఛ విద్యుత్ ప్రవాహంలా పుట్టు చ్చేది! తన కళ్లముందు మెరుపులా మెరిసి, యుంకావటానికి ప్రయత్నించేది శాంతి. తోటి రంటాళ్ళ మధ్య జేరేది. మళ్లీ ఆమె యింటి చ్చేదాకా నిముషాలు లెక్కిస్తూ ఎదురుచూసే డు. ఆ రోజులు వేరు; ఆ అనుభవాలు వేరు. వితం మొత్తానికీ మధుర స్మృతిగా నిల్చిన కాలం ది...ఇప్పుడు ఆ రోజులు రమ్మంటే వస్తాయా ?

అట్లాంటి తియ్యటి ఆలోచనలతో ఆ పగలంతా సిపాడు రాంమ్మోహన్. సాయంత్రం అయిదు ంటల నుంచీ శాంతి రాకకోసం తీవ్రాతితీవ్రంగా దురుచూడసాగాడు పూర్వ స్మృతులు ప్రేరేపించిన లపు వేడితో.

అయిదున్నరైంది. ఆరున్నరైంది. ఏడున్న ైంది. శాంతి రాలేదు. ఆమెమీద కోపం క్షణ ణానికీ పెరిగిపోజొచ్చింది. ఇప్పటిదాకా ఏం చేస్తోంది ? ఆఫీసు నుంచి ఎన్నిసార్లు ఆలస్యంగా రావటాలు ? నిజంగా అక్కడ పనుందా ? ఏదైనా కుంభకోణం జరుగుతూందా ?... రాంమ్మోహన్‌లో చీకాకు చెలరేగింది. పిచ్చి పిచ్చి ఆలోచనలతో అతని మనస్సు ఖరాబు అయింది.

ఎనిమిదిన్నరకు శాంతి వచ్చింది. ఆమె మొహంలో అలసటా, అశాంతీ, అవ్యక్తమైన బాధా ద్యోతక మవుతున్నాయి. ఆమె రాగానే పలకరించ లేదు రాంమ్మోహన్. సీరియస్ అయిపోయి, గంభీ రంగా కూర్చుండిపోయాడు.

తాను ఆలస్యంగా వచ్చినందుకు రావ్ కోప గించుకొని వుంటాడనుకొంది శాంతి. కాని తాను ఏం చేస్తుంది ? తాను పరాధీన యంత్రం వంటిది. తన కదలికలు తన ఇష్టానిష్టాల ననుసరించిలేవు. పరుల ఆదేశాల ప్రకారం తన జీవిత విధానం నిర్దేశమై ఉంది. అడ్డ గీతల మధ్య ఇరుక్కుంది బ్రతుకు. ఆ గీతల్ని తొలిగించుకోలేదూ, ఆ గీతల మధ్య బ్రతకనూలేదు.

ఆఫీసు నుంచి ఇంటికి రాగానే ఆ కొత్త చీరను మార్చి పాత చీర కట్టుకుంది శాంతి. రాంమ్మోహన్ మనస్సు దెబ్బతింది. తాను మెచ్చు కొన్న చీరను, తన దగ్గర వుండే సమయంలో ఆమె మార్చివేయడమేమిటి ? తాను పగలంతా తలపోసింది ఏమిటి ? ఆ చీరలో ఆమె అందాన్ని రాత్రికి మధు రానుభూతిగా మార్చుకోవాలనిగదా! ఆ చీరను మార్చి పాత చీర ఎందుకు ధరించాలి ? కోపంతో అతని మనస్సు రెప రెప లాడింది. కాని అతనికేం తెలుసు — పరుల హస్తాలలో ఆ కొత్త చీర పవిత్ర తను పోగొట్టుకొందని ?



"వంటకు ఓ గంట పడుతుంది. ఈ లోపల ఓ గుక్క కాఫీ త్రాగుతారా ?" అంది శాంతి.

మూతి బిగించుకు కూర్చున్నాడు రాంమ్మోహన్.

ఆమె మళ్లీ అడిగింది.

మాట్లాడలేదు రాంమ్మోహన్.

భోజనం దగ్గర బయటపడ్డాడు.

"నేను అయిదింటికి రమ్మనమంటే — ఇప్పటి దాకా వుండావేం ?"

"మీరు అయిదింటికి రమ్మన్నారని నేను నాలుగింటికే బయలుదేరాను. కాని వీలుపడిందికాదు. ఎం. డి. ని పర్మిషన్ అడిగితే, 'అరే సాయంత్రం ఆరు గంటలకు జపాన్ నుంచి వచ్చిన యిద్దరు ఇండస్ట్రియలిస్టులు ఫ్యాక్టరీని చూడటానికి వస్తున్నామన్నారు. ఇంతకుముందే 'రిట్జ్' నుంచి ఫోన్‌చేశారు. వాళ్ళకి ఫ్యాక్టరీ చూపెట్టాలి. వారి మెప్పునూ మన్ననలనూ పొందాలి. ఈ సంవత్సరం ఓ కోటిరూపాయల మేరకు వాళ్లకు సరుకు ఎగుమతి చేయాల్సివుంది. నువ్వు అప్పుడే పోతే ఎలా ?' అన్నాడాయన. నేనేం చేసేది ? కాదూకూడదని ఎట్లా వచ్చేది ? మీరే చెప్పండి !" అంది శాంతి ఉక్రోషంగా.

రాంమ్మోహన్ నోటికి తాళం పడింది. మనస్సులో క్రోధమూ, ఉద్రేకమూ వుండగట్టుకొని వున్నా — వెళ్లగ్రక్కలేకపోయాడు నిశ్శబ్దంగా భోజనం చేశాడు. ఆ తర్వాత మౌనంగా ముసుగు కప్పుకొని పడుకొన్నాడు. కొంతమంది మౌనంలోనే మిక్కిలిగా బాధపడుతూవుంటారు.

వంట గది సర్దుకొని, ఇంటి తలుపులన్నీ జాగ్రత్తగా వేసుకొని, నీలిమ పక్కన మేనువాల్చింది శాంతి. అప్పటికి రాత్రి పది దాటింది.

రాంమ్మోహన్‌కు కంటిమీద కునుకు పట్టడం లేదు. ఒహాటే కసురుకుంటున్నాడు.

అది గమనించి కూడా శాంతి చూసీ చూడ నట్టు వూరుకుంది. నిద్రపోవటానికి ప్రయత్ని స్తోంది. కాని పొర్లుకొస్తూన్న ఆలోచనలు, మాన సిక వ్యధా ఆమెను నిద్రనుంచి దూరం చేస్తున్నాయి.

"శాంతీ !" పిల్చాడు రాంమ్మోహన్ నెమ్మదిగా.

ఆ పిలుపు తీరుసుబట్టి, ఎందుకు పిలుస్తు న్నాడో గ్రహించింది శాంతి. వినిపించుకోలేదు.

మళ్లీ పిల్చాడు రాంమ్మోహన్ కొంచెం బిగ్గరగా.

శాంతి 'ఊఁ!' అనలేదు; 'ఆఁ!' అనలేదు. నిద్ర నటించింది.

"శాంతీ !" గొంతు జీరపోయేట్టు కేక వేశాడు మూడోసారి.

ఉలిక్కి పడినట్టు లేచి కూర్చుంది శాంతి.

"ఏమిటండీ !" అంది.

రాంమ్మోహన్ మాట్లాడలేదు. తాను అంత బిగ్గరగా ఎందుకు పిల్చాడో అతనికే అర్థంగానట్టు ఉంది.

మళ్లీ పడుకొంది శాంతి.

"శాంతీ !" గొంతు తగ్గించి గోముగా పిల్చాడు.

"ఉఁ!" మూలిగింది నిద్ర విసుగుతో.

"నన్ను బొత్తిగా మర్చిపోయావు. కుంటివాడ్ని లన్న కనికరం కూడా పోతోంది" గొణుక్కున్నాడు రాంమ్మోహన్.

"పొద్దుపోయింది. పడుకోండి" అంది శాంతి విసుగును కనబరుస్తూ.

"నిద్ర రావటంలేదు."

"కళ్లు మూసుకోండి. అదే వస్తుంది."

"కళ్లు మూసుకున్నా, రెప్పలు రెపరెప మంటున్నాయి."

"దేనికీ ?"

"మనస్సులో చెలరేగే కోర్కెకు తట్టుకోలేక–"

"ఏం కోర్కె ?"

"ఇటు రా నాదగ్గరకు – ఆ కోర్కె ఏమిటో చెబుతాను."

"పగలంతా ఆఫీసు పనితో అలసిపోయివున్నాను. నిద్రపడదోసుకొస్తోంది. కాస్త రెస్టు తీసుకోనివ్వండి."

అదంతా నటనలాగా తోచింది రాంమ్మోహన్‌కు. ఉద్యోగంలో చేరిన దగ్గర్నుంచీ ఆమె రాత్రిళ్ళు తన పద్ద పడుకోవటంలేదు. నోరు తెరిచి అడిగితే ఏదో సాకు చెబుతూంది – వీల్లేదనో, వొంట్లో బావుండటం లేదనో, తలనాదుగా వుందనీ, రెస్టు కావాలనో, ఏమిటో ఆమె నైజం ? ఈ మధ్యలోనే ఆమెలో యీ మార్పు కనిపిస్తుంది. అదేమిటో తాను యీ రాత్రి తేల్చుకోవాలి అనుకున్నాడు రాంమ్మోహన్ గట్టిగా.

"అసలు ని ఉద్దేశమేమిటి శాంతీ ! నేను నీకు పనికిరానా ? మన దాంపత్య జీవితాన్ని గురించి అభిప్రాయమేమన్నా మార్చుకున్నావా ?"

ఆ మాటలు ఆమె గుండెల్లో దబ్బనాల్లా గుచ్చుకున్నాయి.

"అదేమిటండీ ! అంత కఠినంగా మాట్లాడతారు. నేను బ్రతుకుతూన్నదీ, వెట్టిచాకిరీ చేస్తున్నది మీకోసం కాదూ !"

"నాకోసమే ! కాని నేను కోరుకున్నది వంచాన్ని కాదు. గుర్తుంచుకో! భరణం తింటూ బతుకుతున్నాననుకున్నావా? నీ బాధ్యతకు బానిసనై పడివుంటున్నాననుకున్నావా ? నేనింకా మనిషినే. నాలో రక్తమాంసాలు రాళ్లుగా ఘనీభవించలేదు. వయస్సూ, వలపూ వుడిగిపోలేదు; సెక్సు వాంఛ సమసిపోలేదు. అందమైన భార్య నాకొకటి వున్నదనీ, శారీరక వాంఛల్ని ప్రేమగా కాకపోయినా విధిగా నన్నా మన్నిస్తుందనీ, దాంపత్య సుఖానికి సాధనంగా వుంటుందనీ అనుకొంటున్నాను. నేను కోరినప్పుడు నాదగ్గరకు రావడం నీ ధర్మంకాదా ? అందులో ఏదైనా అపవిత్రత వుందా ? నేను పరాయి పురుషుణ్నా ? నన్నెందుకు యిట్లా 'ట్రీట్' చేస్తున్నావ్ శాంతీ!" ఆవేశంతో రాంమ్మోహన్ వొళ్లంతా వూగిపోయింది.

కాని శాంతి అంతటి ఆవేశానికి గురికాలేదు. భర్తనుంచి యిట్లాంటి ప్రశ్నలు వస్తాయనీ, అవి విషపు బాణాల్లా తన గుండెను గుచ్చుకుంటాయనీ, వాటికి సమాధానాలూ, సంజాయిషీలూ చెప్పుకోవాల్సిన సమయం వస్తుందనీ ఉద్యోగంలో ప్రవేశిద్దామనే నిర్ణయం చేసుకొన్నప్పుడే అనుకుంది. ఆ నిర్ణయంతోపాటు మరో నిర్ణయంకూడా చేసుకుందామె. రఘునాథ్ పెట్టిన షరతులు ఒప్పుకొని ఉద్యోగంలో చేరితే, తాను వ్యక్తిత్వాన్నీ, భార్యగా పవిత్రతనూ, విలువల్నీ కోల్పోయినట్లే ! ఒకసారి కోల్పోయిన తర్వాత తిరిగి నిలబెట్టుకొనే అవకాశం లేదు. కాకపోతే ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా సమర్థించుకోవటానికి ప్రయత్నించవచ్చు. ఆ సమర్థనను సమాజంలో కొంతమంది సానుభూతితో ఆలోచించవచ్చు; మరికొంతమంది గర్హించవచ్చు; యింకా కొంతమంది నిర్లిప్తంగా వుండొచ్చు. కాని తాను నిర్ణయించుకొంది యిది. తాను రావ్‌ను ప్రాణానికి ప్రాణంగా ప్రేమించింది. బ్రతికుండగా ఆయనకు ద్రోహం చేయలేదు. ఏదైనా ద్రోహం చేసిందంటే, తాను మానసికంగా ఆత్మహత్య చేసుకొన్నట్లె. అపవిత్రమైన ఈ శరీరాన్ని రావ్‌కు అందించి మోసంచేయలేదు, ఆత్మను విషపూరితం చేసుకొని బ్రతకలేదు. అందుచేతనే తాను యంత్రంగా మారిపోయింది. రఘునాథ్‌కు అనుభవాలను అందించిన ఈ శరీరంతో తాను రావ్‌ను చేరలేదు. ఈ విషయాన్ని రావ్‌తో ఎట్లా చెప్పడం? తాను చెప్పలేదు. రావ్‌కు తెలీదు. ఎట్లా? ఈ సంఘర్షణ ఎన్నాళ్లు కొనసాగాలి ? దీనికి పరిష్కార మార్గం లేదా ? ఈ సెంటిమెంట్ కొత్తది కావచ్చు. దాన్ని తాను తార్కికంగా సమర్థించుకోలేకపోవచ్చు. అయితే తన విశ్వాసం అది. రావ్‌కు తాను ఇస్తూన్న గౌరవం అది. తన ఆత్మప్రబోధం అది.

"ఏం మాట్లాడవేం ?" గర్జించాడు రాంమ్మోహన్.

"ఏం మాట్లాడేదండీ ! నన్ను మీరు అర్థం చేసుకోవడంలేదు. ఆవేశపడుతున్నారు అనవసరంగా. ఇప్పుడు నేను ఏం చెప్పినా మీరు వినే స్థితిలో లేరు. విశ్రాంతి తీసుకోండి" అంది శాంతి సౌమ్యంగా.

"ఈ కూరగాయల కబుర్లు నేను వినదల్చుకోలేదు. సూటిగా సమాధానం చెప్పు."

"నా ఆరోగ్యం బావుండలేదని చెబుతున్నానుగదండీ ! మీ కంత పట్టుదల దేనికి ? నేను మీకు భార్యగా కాకుండా పోతానని భయమా ? అనుమానమా ? అయితే చెప్పండి. రేపే ఉద్యోగానికి రాజీనామా ఇస్తాను. ఇంట్లో కూర్చుంటాను ఇరవై నాల్గు గంటలూ, ఏ ఉద్యోగమూ చేయను. ఏ సంపాదనా అక్కర్లేదు. డబ్బు ఉన్నంతకాలం తిందాం. ఆ తర్వాత ఇల్లు ఖాళీ చేసి ఏ సత్రం పంచనో, ఏ చెట్టు నీడనో చేరదాం. మీరు కూర్చుని వుండండి. నేనూ, నీలూ ఊరిమీద బడి, 'అయ్యా ! బాబూ ! ధర్మం చేయండి. ఓ ముద్ద పెట్టండి. కడుపులు మాడిపోతున్నాయి. కరుణించండి.' అంటూ అడుక్కొనివచ్చి, మీకు రెండు ముద్దలు పెట్టి, మేం రెండు ముద్దలు తింటాం. ఏం ? సరేనా ? ఆ పని చేయమంటారా ?"

రాంమ్మోహన్ చప్పబడ్డాడు ఆమె కోపాన్ని చూసి, మళ్లీ నోరెత్తలేదు. ఆమెచేత ఉద్యోగం మాన్పిస్తే, నిజంగా పట్టేగతి అదే ! ఆ దారిద్ర్యాన్ని, ఆ నరకాన్ని, ఆ హింసనూ తాను భరించగలడా ? లేదు. లేదు ! భగవంతుడా ! అంత పని చేయకు. ఆ గతి పట్టించకు !... ఆలోచిస్తూ ఏ అర్ధరాత్రికో నిద్రబోయాడు రాంమ్మోహన్.



క్రౌర్యం (ఫొటో : బి. ఏ. రె

24

ఆ మరునాడు ఉదయం శాంతి కాఫీ ఇ ఇవ్వగా –

"ఎక్స్‌క్యూజ్ మి శాంతీ ! రాత్రి అసహ్యం అసభ్యంగా ప్రవర్తించాను. ఏమీ అనుకోకు" అన్నా రాంమ్మోహన్ సిగ్గుపడుతూ.

ఆ మాటలకు శాంతికి ఒక పక్కన సం షమూ, మరో పక్కన జాలీ కలిగాయి.

"దానిదేముందిలెండి. మనస్సు చికాక వున్నప్పుడు ఎవరికైనా కోపం రావటం కద్దు; తర్ ఆలోచించుకొంటే తొందరపాటు అర్థమవుతుం నాకైనా అంతే !" అంది శాంతి.

"అది కాదు శాంతీ ! మనిషిలో అంగవైకల్ ద్వారా అశక్తత ఏర్పడినప్పుడు అది అనేకమై అనర్థాలకు దారి తీస్తుంది. ప్రతి చిన్న అసౌకర్యా కోపాన్ని పుట్టిస్తుంది. కోపం పుట్టటంతో ఆలో నకు అవకాశం వుండదు. ఆలోచన మృగ్యమైనప్ప అనవసరపు మాటలు దొర్లుతాయి. అసమర్థులు శక్తిహీనులూ నిజమైన శక్తిమంతుల సామర్థ్యాన్నీ ప్రయోజకత్వాన్నీ దూషించడం మినహా ఏమీ చేం లేరు. సహం అసామర్థ్యం ఎక్కడుంటే, అక్క అనుమానాలు చోటుచేసుకుంటాయనుకుంటాన తమమీద తమకు విశ్వాసం లేనివారే ఇతర్ల చేష్ట లోని తప్పిదాన్ని వెతకటానికి ప్రయత్నిస్తూ వుంటార ఆ బలహీనత నాలోకూడా అభివృద్ధి అవుతూ దేమో నన్న భయం కలుగుతోంది."

"అబ్బ ! పోనివ్వండి. మీరు కోపగించుకోవడ నేను ఆవేశాన్ని అణుచుకొని కుమిలిపోవడం, ఆపై మీరు పశ్చాత్తాపపడడమూ, నేను సముదాయిం డమూ – ఈ ప్రొసెస్ మనకు కొత్త ఏమీకాదు ఆ మాటకొస్తే చాలా సంసారాల్లో వుండే తతంగమే ఎందుకంత హైరానా పడతారు? రాత్రి మీ ప్రవర్త వలో ఒహళ్ళు ఆక్షేపించే అంశాలేమీ లేవు" అం శాంతి.

అప్పటికిగానీ రాంమ్మోహన్ మనస్సు శాంతిం లేదు.

రోజులు గడుస్తున్నాయి. నెలలు తిరిగిపోతున్నాయి.

శాంతి అప్పుడప్పుడూ ఆఫీసు నుంచి యింటికి లేటుగానే వస్తూన్నది. అందుకు కారణాలను రాంమ్మోహన్ అంతగా అడగడంలేదు. అప్పుడప్పుడూ శాంతే చెబుతూ వుంటుంది. అయితే రఘునాథ్, శాంతిల వ్యవహారాలు అతి రహస్యంగా, ఎవ్వరికీ తెలియకుండా జరిగిపోతున్నాయని అనుకోవడానికి ఆస్కారం లేదు. పొగ లేకుండానే మంటలు ఉండుతున్నాయని ప్రచారాలు జరిగే ఈ రోజుల్లో, వాళ్లను గురించి ఎవ్వరూ ఏమీ అనుకోవడంలేదని అనుకోవడం పొరబాటు. ఈ విషయంలో రఘునాథ్ ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ, ఎన్ని కట్టుబాట్లు చేసినప్పటికీ ఆ నోటా ఆ నోటా ఆఫీసంతా ప్రాకిపోయింది. అయితే మేనేజింగ్ డైరక్టరు మంచితనంవల్ల, సిబ్బందితో ఆయనకు ఉల సత్సంబంధాలవల్ల — ఎవ్వరూ బహిరంగంగా చెప్పుకోవటంలేదు. అదే ఇంకో ఆఫీసైతే గోడల మీదకు పేర్లు ఎక్కి ఎంతో గొడవ జరిగిపోయి వుండేది.

రఘునాథ్ ఏ షరతుల మీద శాంతికి ఉద్యోగం ఇచ్చిందీ, శాంతి ఎందుకు ఒప్పుకొందీ, వాళ్ల ఇరువురికి ఏ ప్రదేశంలో అక్రమ సంబంధాలు నిరాటంకంగా జరుగుతూన్నదీ జ్యోతికి పూర్తి వివరాలు తెలియవు. కాని తన స్థానాన్ని శాంతి ఆక్రమించిందన్న అసూయ, ద్వేషం, ఉక్రోషం, పగ, తపనకొద్దీ ముందుగా ఆమెయే పొగ రగలటానికి కారణభూతమైంది. శాంతిలో ఏదో ఒక ఆకర్షణ లేకపోతే ఎం. డి. ఆ పోస్టులో ఆమెను నియమించడు. ఆ ఆకర్షణ ప్రధానంగా ఆమె అందమే. సంసార స్త్రీల సౌందర్యమంటే రఘునాథ్ పడిచస్తాడు. అందులో కృత్రిమత్వం ఉండదట. ఆయన్ను శాంతి వలలో వేసుకొని ఉంటుంది. అందుచేతనే తనని సెక్షన్ మార్చాడు ఎం. డి. ఈ సంగతిని తన భార్యకు తెలియనివ్వవద్దని కూడా హెచ్చరిక చేశాడు. ఇందులో ఏదో గుట్టు వుంది. ఆవిడకు తెలిస్తే రహస్యం రచ్చకెక్కుతుందని భయం! తాను చెప్పకపోతే

దాహం (ఫోటో : బి. పి. రెడ్డి)



# శ్రావణ సంధ్య

మటుకు, ఆవిడకు తెలిసే అవకాశాలు లేవా? ఆ అవకాశాల్ని తాను సృష్టించలేదా? అనుకుంది జ్యోతి. ఎం. డి. కీ, కొత్తగా వచ్చిన శాంతికీ అంతకుముందే అక్రమ సంబంధం వున్నదనీ, ఆ అవినీతి కార్యకలాపాలను అనుమానరహితంగా కొనసాగించుకోవటానికి ఆమెకు ఉద్యోగ మిచ్చాడనీ జ్యోతి ముందుగా తోటి లేడీ క్లర్కు చెవిలో వూదింది. అదే క్రమంగా ఆఫీసంతా ప్రాకిపోయింది.

ఒకరోజు సాయంత్రం జ్యోతి ఇంటికి వెళ్లాడు రాజారాం శాంతి ఉద్యోగ విషయాలను గురించి తెల్సుకుందామని. అతని ఉద్దేశం ప్రకారం తుఫాన్‌కు గురై నడి సముద్రంలో బోర్లాపడ్డ నావ మళ్లీ సరైన స్థానంలో కుదుటబడి, ప్రయాణం చేయటానికి వీల్లేదు. అందుచేతనే శాంతికి ఉద్యోగం ఎచ్చిందనీ, తద్వారా వాళ్ళ ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతూందనీ తెల్సుకొన్నమీదట — మళ్లీ ఏదో ఒక తుఫాన్ వాళ్ల జీవితాల్లో వచ్చేట్టు చేయాలనీ జ్యోతిని ఆశ్రయించాడు. తాను శాంతిని ప్రేమించాడు. ఆమెను వివాహం చేసుకుందామనుకున్నాడు. ఈ విషయంలో ఆమె తండ్రి ఒప్పుకున్నాడు; ఆయన పట్టుదలగానే వ్యవహరించాడు. కాని శాంతియే తనంతట తాను రెక్కలొచ్చిన పక్షిలాగ ప్రేమకోసం ఎగిరిపోయింది. ఏం అనుభవించింది? ఆమె జీవితం దుఃఖపూరితం కావడం, అన్నివిధాలా కష్టాలపాలుకావడం—తనకు కావాల్సింది! రాజారాంను చేసుకొంటే తన బ్రతుకు సుఖపడేదేమో అనుకోవాలి ఆమె ఎప్పటికైనా. అప్పుడే తన మనస్సుకు సంతృప్తి; పగ చల్లారుతుంది; ప్రతీకారం నెరవేరుతుంది — అనుకున్నాడు రాజారాం. ఆ ప్రయత్నంలో జ్యోతి దగ్గరకు వచ్చాడు. అప్పుడు జ్యోతి భర్త రామకృష్ణ యింట్లో లేడు. ఎవరో ఫ్రెండ్ పిలిస్తే తీర్థం సేవించడానికి వెళ్లాడట.

"జ్యోతీ! ఈ మధ్య నిన్ను ఎం. డి. కి పి. ఏ. గా తీసివేశారట. నిజమేనా?" అన్నాడు రాజారాం ఉపోద్ఘాతంగా.

"ఈ విషయం పల్లెలకు కూడా పాకిందన్న మాట! ఒక్క మా ఆఫీసు గోడలకే పరిమితమైందనుకున్నాను" అంది జ్యోతి.

"నీ స్థానాన్ని దురాక్రమణ చేసిన దుర్మార్గురాలు ఎవరు?"

"శాంతి అని, నాకంటె కాస్త ఎర్రగా బుర్రగా వుంటుందిలే. దాని మోజులో పడి, మా ఎం. డి. నన్ను డిస్పాచ్‌లో పడేశాడు—"

"అరటి తొక్కను చెత్తకుండీలో పడేసినట్టు. అంతేనా?"

"నీకు ఎగతాళిగా వుందే?"

"నాకే కాదు జ్యోతీ! నీ విషయం తెల్సిన ప్రతివాడూ నీ స్థితిని చూసి నవ్వుతున్నారు. ఇలా నవ్వులపాలు అయ్యేకంటె ఆ జాబ్‌కు రిజైన్ ఇవ్వరాదూ!"

"రిజైన్ ఇస్తే ఏమౌతుంది? అందులో ఉండే పగ తీర్చుకోవాలి. ప్రతీకారంగా దాన్ని బయటకు పంపాలి. మళ్లీ ఆ స్థానాన్ని నేను అలంకరించాలి."

## దీపం

దీప మెలుగుతున్నదనీ
చీకటుండ బోదనీ
తలుచుకొనే వెర్రివాడ
విసురు గాలి వీచుననీ
వెలుగుదివ్వె ఆరుననీ
తెలుసుకోర తెలివిమీర.

వెంటనున్న వెలుగులను
చెంతనున్న చీకటులను
కన్నోయితో కనిపెట్టి
రేపు మాపు తలుచుకొనీ
మంచి చెడులు తెలుసుకొనీ
జీవితాన్ని మలుచుకో
జీవనాన్ని నిలుపుకో...

— మ. జా.

"నీ ఐడియా బాగానే వుంది. కాని దానికి ప్లాన్ వేశావా?"

"నా ఒక్కదానివల్ల కాదు. ముందుగానీ, వెనకగానీ ఎవరైనా వుండాలి."

"నేనుంటాను. గో ఎహెడ్!"

ఆశ్చర్యపోయింది జ్యోతి.

"నీకెందుకంత యింటరెస్టు? శాంతి నీకు తెలుసా?"

చెప్పాడు రాజారాం — ఆమెకూ తనకూ గల బంధుత్వమూ, ఆమె రాంమ్మోహన్‌ను ప్రేమించి పెళ్లి చేసుకోవడమూ, తనని తిరస్కరించడమూ, ఆమెమీద ప్రతీకారం తీర్చుకోవాలన్న తన అభిలాష. జ్యోతి విపరీతంగా సంతోషించింది.

"ఈ విషయంలో మన యిరువురి ఉద్దేశాలూ ఒకటైనాయి. సాధించితీరాలి. శాంతికి తగిన శాస్తి చేయాలి."

"అయితే నీ ప్లాన్ ఏమిటో చెప్పు."

"అంత త్వరపడతావేం? ప్లాన్ వేస్తాను. ఆ ప్లాన్‌ను నువ్వు అమలుపర్చాలి. నువ్వు తెర బయట వుండాలి. నేను తెర వెనుక వుంటాను. నాటకాన్ని రక్తికట్టించి, ఆమె నామరూపాల్ని లేకుండా చేసే బాధ్యత నాది. మా ఎం. డి. ప్రాణమూ, పరువు ప్రతిష్టలూ ఎవరి చేతుల్లో వున్నాయో నాకు తెలుసు."

"శాంతి ప్రాణమూ, పరువు ప్రతిష్టలూ ఎవరి చేతుల్లో వున్నాయో నాకూ తెలుసు."

"అయితే మన పని అతి సులువే" అంది జ్యోతి నవ్వుతూ.

ఆ నవ్వులో తన నవ్వునుకూడా కలిపాడు రాజారాం ఉషారుగా.

(ఇంకా వుంది)



# డిపీస్ సఖ్యతను పెంపొందించేవి

అత్తగారు ఎంతో మంచివారే. కాని ఎలాగైనా అత్తగారు అత్తగారే. అయితే మీ అత్తగారు మీ యింటికి వచ్చారనుకోండి. మీరు కొంచెం భయపడతారు. ఆభయంతోపాటు ఆవిడని ఎలాగైనా మెప్పించాలనే కోరికా పుడుతుంది మీలో.



మీరు, ఆవిడ ఊహించని విధంగా ఆమెను మెప్పించండి. ఆవిడ ఎండలో పడి అలసిపోయి రాగానే చల్ల చల్లని డిపీస్ స్క్వాష్ ఓ గ్లాసు యివ్వండి. గొంతుక ఎండిపోతున్నప్పుడు దానిని మించినది లేదు. అంతేకాదు, అది సేద తీరుస్తుంది కూడా!



ఇక రాత్రి భోజనం కాగానే, ఆనాటి పసందైన విందుకు ముగింపుగా డిపీస్ జెల్లీ (క్రిస్టల్స్) అందించండి. మరి మీ అత్తగారి ముఖంలో మాటిమాటికీ చిరునవ్వుతో బాటు ఆమె మిమ్మల్ని బోలెడు అభిమానంతో అభినందిస్తూనే ఉంటుంది. ఆ! ఇతరులను ఎలా మెప్పించాలో మీకు ఒకరు చెప్పాలా ఏమిటి? మీకే తెలుసు!



మాటవరసకి ఆవిడ మధ్యాహ్నం భోజనాలవేళ వచ్చారనుకుందాం. ఆమెను ఆశ్చర్యంలో ముంచి తేల్చేందుకు మీరు అన్నీ సిద్ధం చేసుకొనే ఉంటారు. డిపీస్ టొమాటో సూప్ లేక డిపీస్ స్వీట్ కార్న్‌తో తయారుచేసిన చవులూరించే రుచి గల సూప్ వడ్డించండి. దాంతోపాటే కొద్దిగా వర్సెస్టర్‌షైర్ సాస్ కూడా—ఆహా!... మరింక చూడండి ఫలితం.



టీ వేళల్లో ఆవిడకు ఫలహారాలు వడ్డించాలనుకోండి. మీరు వడ్డించే ఫలహారాలతో పాటు డిపీస్ టొమాటో కెచప్, లేక 8 టు 8 సాస్ కూడా వడ్డించండి. ఆమె ఎంత సరదాగా ఆ ఫలహారాలను తింటారో చూడండి.




డిపీస్ సమకూర్చే రకరకాల ఆహారపదార్థాలను వాడండి— వాని రుచిని మర్చిపోలేరింక!

Interpub/HL/10/75 Tel



# ★ సినిమా విశేషాలు ★

### క్రాంతి కోసం ఆత్రేయ పాట

నవంబర్ 4వ తేదీ ఉదయం ఏడున్నర గంటలకు సంగీత దర్శకుడు చక్రవర్తి, సంభాషణలకర్త సత్యానంద్, పాటల రచయిత ఆత్రేయ, ఛాయాగ్రాహకుడు విన్సెంట్, ఎడిటర్ అంకిరెడ్డి, దర్శకుడు కె రాఘవేంద్రరావు, నిర్మాత క్రాంతికుమార్ జెమినీ స్టుడియో రికార్డింగ్ థియేటర్లో సమావేశమయ్యారు వాయిద్యాల హడావుడి ఒక ప్రక్క, ఆహూతుల ఆగమనం మరొక ప్రక్క వుండగా గాయని యస్. జానకి, గాయకుడు యస్. పి. బాలసుబ్రమణ్యం హాల్లోకి ప్రవేశించారు. ఇంతకూ అసలు విషయం ఏమిటంటే శ్రీ అన్నపూర్ణ సినీ ఎంటర్ ప్రైజెస్ బ్యానరుపై క్రాంతికుమార్ నిర్మిస్తున్న "జ్యోతి" చిత్రం తొలిపాట రికార్డింగ్ ముహూర్తం ఆ రోజు అందుకే ఆ సందడి

సాంకేతిక పరివారంతోబాటు చిత్రంలో నటించే సత్యనారాయణ, గుమ్మడి, జయసుధ, గిరిబాబు మున్నగువారుకూడా ఈ సందడిలో పాల్గొన్నారు కె ఎస్ పి (దర్శకుడు) క్రాంతికి, తనయుడు కె ఆర్. ఆర్‌కు తన అభినందనలను తెల్పారు.

మరి జెమినీ కోటేశ్వరరావు వూరుకున్నారా! ఆత్రేయ వ్రాసిన "సిరిమల్లె పూవల్లె నవ్వు" అనే డ్యూయెట్‌ను యస్. జానకి, యస్. పి.బి. పాడుతుండగా, రికార్డు చేసారు 'చిత్రంలో ఈ పాటను జయసుధ, మురళీమోహన్‌ల మీద చిత్రీకరిస్తాం' అన్నారు నిర్మాత క్రాంతికుమార్, దర్శకుడు రాఘవేంద్రరావు.

డిశంబర్ 7వ తేదీ నుంచీ అవుట్‌డోర్‌లో షూటింగ్ జరుపుకునే ఈ చిత్రంలో రావు గోపాలరావు కూడా నటిస్తున్నారు పి ఆనందారామం వ్రాసిన ఈ కథకు చక్కటి తెరరూప మిస్తున్నారు క్రాంతి, రాఘవేంద్రరావ్

### గౌరమ్మా .. నీ మొగుడెవరమ్మా!

గజానన ఫిలింస్ తలపెట్టిన చిత్రానికి లక్ష్మీదీపక్ దర్శకుడుగా పదవీస్వీకారం చేసిన తరువాత, కథలో ఆకర్షణీయమైన, గణనీయమైన మలుపులు, మార్పులు జరిగాయి

అగ్రనటి వాణిశ్రీకి ప్రీతిపాత్రమైన పాత్ర ఈ సంస్థలో లభించింది ఆమె యింతవరకు ధరించని "మాస్" పాత్రను యీ చిత్రంలో పోషిస్తుంది కథానాయిక పేరు గౌరి.

చిత్రానికి "గౌరమ్మా నీమొగుడెవరమ్మా" అని పేరిడినట్టు నిర్మాత పుష్పరాజ్ చెప్పారు.

### వాణిశ్రీ రామకృష్ణ - జయసుధ

చిత్రంలోని పాత్రలను పోషించ, సత్యనారాయణ, రాజబాబు, అల్లురామలింగయ్య, రమాప్రభ సహాయ భూమికలను ధరిస్తున్నారు. ఈ చిత్రానికి అప్పలాచార్య రచనను, జె వి రాఘవులు సంగీతాన్ని, సంజీవి ఛాయను నిర్వహిస్తున్నారు.

"దేవుడులాంటి మనిషి"లో మంజుల



''ఆడవాళ్లు—అపనిందలు''లో జయంతి

### మహాత్ముడు

రాజేశ్వరి చిత్ర తలపెట్టిన వర్ణ చిత్రానికి 'మహాత్ముడు'' అని పేరిడినట్టు, తమిళ రచయిత ఆర్ కె ధర్మరాజు యిచ్చిన కథను, నిర్మాత గోపీనాథ్ అంగీకరించినట్టు పాఠకులకు తెలిపాను

గత వారం రాజేశ్వరి చిత్రకు వెళ్లినప్పుడు, అక్కడ గోపీనాథ్, పినిశెట్టి, కృష్ణమోహన్ వేరొక కథపై చర్చ జరుపుతున్న నిజాన్ని చూసి, ఎందుకిలా జరిగింది అని ప్రశ్నించాను

తమిళ రచయిత ధర్మరాజు తనకు చెప్పిన కథను, వేరొకరికి అమ్మినట్టు, అది చిత్రంగా (ఎల్లైకోడు) విడుదలైనట్టు, నమ్మించి నాటక మాడిన అతడి చర్యను నిరసిస్తూ, వేరొక కథను తయారు చేసే ప్రయత్నంలో వున్నట్టు వెల్లడించారు చూశారా, కాల వైపరీత్యం! ఎవర్ని నమ్మాలో తెలియడంలేదు అన్నారు గోపీనాథ్.

### కీచకుడిగా అల్లు రామలింగయ్య

''నర్తనశాల'' చిత్రంలో కీచకుడిగా నటించి మనల్ని మెప్పించారు కీ శే యస్వీ రంగారావు ''నిజం నిద్రపోదు'' చిత్రంలో కీచకుడిగా కన్పించి మనల్ని కడుపుబ్బ నవ్విస్తారు అల్లు రామలింగయ్య

సాంఘిక చిత్రంలో పౌరాణిక ఘట్టమేమిటి? అని చిత్ర నిర్మాత గోవిందరాజుగార్ని అడిగితే, ''కీచక వధ'' అనే వీధిభాగోతాన్ని ఇందులో చొప్పించాము. కామెడీ పార్టును మరింత ఇంటరెస్టింగ్‌గా చేద్దామనే వుద్దేశ్యంతో ఈ పని చేశాం అన్నారు నిర్మాత గోవిందరాజు, దర్శకుడు రాజశ్రీ

మరి మీ చిత్రంలో ప్రత్యేకత లేమిటి? అన్న నా ప్రశ్నకు రాజశ్రీ ఇలా బదులిచ్చారు. ఈ చిత్రంలో పరిస్థితుల ప్రభావం వల్ల రామకృష్ణ దొంగగా మారుతాడు దొంగతనంలో కూడా దొరతనం చూపించడం అతని ప్రత్యేకత ఒక మనిషికి ఒక రోజు గడవడానికి పది రూపాయలుంటే చాలు అనే సూత్రంపై, వంద కొట్టినా, వెయ్యి కొట్టినా, తనకు కావల్సిన పది రూపాయలు మాత్రం తీసుకుని మిగతాది యథాస్థానంలో వుంచడం అతని అలవాటు మంగళవారంనాడు దొంగతనం చేయడు ఆ రోజు కాయకష్టం చేసి జీవిస్తాడు. రామకృష్ణను మనసారా ప్రేమించిన స్త్రీ పాత్రను మమత పోషించింది చిత్రంలో ప్రతి రోజూ పూలమ్మడానికి బయల్దేరి, తన ప్రియుడు రామకృష్ణ గుమ్మం ముందు ఓ పువ్వు వుంచిగానీ, పరాయివాళ్లకు పూలమ్మదు మమత ఇది మమత పాత్రలోని ప్రత్యేకత

రాజశ్రీ కథ, మాటలు, పాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం సమకూర్చిన ఈ చిత్రం డిశంబర్ అయిదున పూర్ణా ద్వారా విడుదలౌతుంది. చిత్రంలోని దుష్ట పాత్రలను రాజనాల, త్యాగరాజు పోషించగా, మురళీమోహన్, సుమిత్ర, గిరిజ, కృష్ణకుమారి, ప్రధాన పాత్రలను ధరించారు. సత్యం సంగీతం, మధుసూదన్ ఛాయ, బాబు కూర్పు, సోమనాథ్ కళను సమకూర్చారీ చిత్రానికి.

### రాజబాబు ఛాలెంజ్

రాజబాబు ఒక మంత్రి కుమారుడు. తనకు యుక్తవయస్సు రాగానే తన తండ్రిగార్ని, పెళ్లి చేయమని అడుగుతాడు రాజబాబు. పనికిమాలిన వాడికి పిల్ల నెవరిస్తారని పరిహసిస్తాడు మంత్రి. ఆ పరిహాసం రాజబాబులో పట్టుదలను పెంచింది. ఏనాటికైనా పెళ్లి చేసుకొని, పెళ్లాం, పిల్లలతో తిరిగొస్తానని శపథం చేసి వెళ్లిపోతాడు రాజబాబు

మార్గమధ్యంలో ఒక పాడుపడిన బావిలో చిక్కుంటాడు అక్కడ దెయ్యాల సహకారంతో మూడు మంత్రపు కొబ్బరికాయలు సంపాయిస్తాడు. ఆ కొబ్బరికాయల సాయంతో అంతకు మునుపే తను ప్రేమించిన యువతిని చేపట్టాలని ప్రయత్నించి, విఫలుడౌతాడు నిరాశతో మళ్లీ అదే బావిలో దూకుతాడు ఈసారి ఒక మోహిని చేతికి దొరుకుతాడు ఆ మోహిని ముగ్ధమోహన రూపానికి అయిపోతాడు రాజబాబు కానీ ఆ మోహిని కబంధ హస్తాల్లో నలిగి, మూర్ఛపోతాడు మూర్ఛిల్లిన రాజబాబును అతని సాయంతో శాపవిముక్తులైన దెయ్యాలు చూస్తాయి అతనికి స్పృహ వచ్చేట్టు చేస్తాయి. అతని విషాద గాథ విని ఏది కోరినా ఇచ్చే ఒక గంటను ప్రసాదిస్తాయి అతనికి ఆ గంట సహాకారంతో కోరుకున్న కన్నియను పరిణయమాడి, పిల్లలను కని, భార్యా బిడ్డలతో రాజదర్బారు చేరుకుంటాడు రాజబాబు

ఇలాంటి విచిత్ర పాత్రలో రాజబాబు ''కోటలో పాగా'' చిత్రంలో కన్పిస్తారు మనకు జానపద బ్రహ్మ బి విఠలాచార్య సృష్టించిన మరో జానపద రాజమే ''కోటలో పాగా'' జయసుధ ద్విపాత్రాభినయం, ఎనిమిది కాళ్ల ఏనుగు డాన్స్, మోహిని ఏ భాగానికి ఆ భాగంగా నాట్యం చేయడం, జయసుధను అడుగడుగునా ఏలుగుబంట్లు రక్షించడం ప్రత్యేకాకర్షణలుగా గల ఈ చిత్రంలో రామకృష్ణ, సుదర్శన్, రాజనాల, జయమాలిని, సుశీల, కేశవరావు ముఖ్య పాత్రధారులు



''అమ్మా—నాన్న''లో జయసుధ



"పెద్ద మనిషి"లో ఒక దృశ్యం

# సినిమా

### నాగభూషణం సెక్రటరీగా జయమాలిని

రమాప్రభ సమర్పించు కరుణ చిత్ర వారి "వింత ఇల్లు — సంతగోల" చిత్రంలో డాక్టర్ మనశ్శాంతిగా నాగభూషణం నటిస్తున్నారు ఈ మనశ్శాంతి మనస్తత్వం ఎలాంటిదన - జబ్బేమిటో, రోగెవరో తెల్సుకోకుండానే తాను కన్‌ఫ్యూజ్ అవుతూ, ఎదుటివార్ని కూడా కన్‌ఫ్యూజ్ చేస్తుంటాడు డాక్టర్ మనశ్శాంతి మంచి మనసున్న ఈ మనశ్శాంతి కొక సెక్రటరీ ఆవిడే జయమాలిని

తనకు జీవమిచ్చిన తండ్రి కాకపోయినా, తన జీవితం గడపడానికొక ఉపాధి కల్పించిన కరుణామయుడు అనే కృతజ్ఞతాభావంతో మనశ్శాంతిని తన డాడీలా చూస్తుంది జయమాలిని మనశ్శాంతి పాత్ర చిత్రంలో కన్పించినపుడల్లా పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుతాం మనం

పి. లక్ష్మీదీపక్ దర్శకత్వంలో శరవేగంగా తయారౌతున్న ఈ నవ్వుల చిత్రాన్ని డిశంబర్‌లో విడుదల చేయాలనుకుంటున్నారు నిర్మాతలు కమలాకరరావు, ఆనంద్ అప్పలాచార్య మాటలు, బి శంకర్ సంగీతం, దేవరాజ్ ఛాయ, తోట కళ, వెంకటరత్నం కూర్పు సమకూరుస్తున్న యీ చిత్రానికి దయానంద్‌రావు నిర్వహణ

సత్యనారాయణ, రాజబాబు, కాంతారావు, చంద్రమోహన్, శరత్‌బాబు, గిరిబాబు, అల్లు రామలింగయ్య, ఆర్ నాగేశ్వరరావు కుమారుడు మోహన్, రమాప్రభ, ప్రభ, నిర్మల, జ్యోతిలక్ష్మి, శుభ ముఖ్య పాత్రలనుపోషించిన యీ చిత్రం తారకరామా విడుదల

తారకరామా వార్కుకు యిదొక హిట్ చిత్రం అవుతుందనెడి అభిప్రాయం పరిశ్రమలో వ్యాపించి కుంది

### ఎం. జి. ఆర్ ద్విపాత్రాభినయం

పద్మజయ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న "వజ్రాల దొంగ" వర్ణ చిత్రంలో ఎం. జి ఆర్. ద్విపాత్రాభినయం చేస్తున్నారు ఆయన సరసన శారద, మంజుల, లత స్త్రీ పాత్రలను పోషిస్తున్నారు.

ఈ చిత్రానికి ఆనిసెట్టి మాట, పాటలను, జె వి రాఘవులు సంగీతాన్ని సమకూర్చారు

ప్రేక్షకులు ఆశించే శృంగారం, సాహసం, కరుణరసం, వినోదం "వజ్రాల దొంగ" చిత్రంలో వున్నాయి అని నిర్మాతలు ఎస్. కుమారస్వామి, ఎమ్ సత్యం చెప్పారు

"మోతీ" అనెడి కుక్కపిల్ల చేసిన వింత చర్యలు ప్రేక్షకులను ఆశ్చర్యచకితుల్ని చెయ్యగలదు అని నిర్మాణ నిర్వాహకుడు పి సత్యనారాయణ మూర్తి చెప్పారు

"వజ్రాల దొంగ" చిత్రాన్ని ఎమ్ భాస్కరరావు, ఆర్ బ్రహ్మయ్య సమర్పిస్తున్నారు

### కథ, సంగీతం, దర్శకత్వం

సంగీతరస ప్రధానమైన చిత్రాలను నిర్మించడంలో భరణీ పిక్చర్స్‌కు మొదటి స్థానం వుంది ఆ సంస్థ అందించిన అన్ని చిత్రాలలో పాటల ప్రాధాన్యతను ప్రేక్షకులు ప్రశంసించారు.

ఇరవై + ఒకటి చిత్రాలను పూర్తిచేసిన భరణీ సంస్థ తన యిరవై రెండవ చిత్రాన్ని ప్రారంభించింది

ఈ చిత్రానికి కథ, సంగీతం, దర్శకత్వంతో బాటు కథానాయిక పాత్ర నిర్వహణను కూడా భానుమతిగారు చేపట్టారు.

ఈ చిత్రానికి డి వి నరసరాజు సంభాషణలను, లక్ష్మణగోరే ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు.

ప్రధాన పాత్రలను శ్రీధర్, విధుబాల, పద్మనాభం, నాగేష్, విజయభాను, ఛాయాదేవి పోషిస్తున్నారు.

### అయిదు చిత్రాలలో జయచిత్ర

సురేష్ నాయుడుగారి హస్తవాసి చాలా మంచిది ఆయన పరిచయంచేస్తే, ఆ వ్యక్తికి మంచి మాత్రమే జరుగుతుంది ఆయన ద్వారా వచ్చిన ఎందరో యీనాడు అందరికీ అయినవాళ్ళుగా వుంటున్నారు

"పొగ్గాడు" చిత్రంలోని హీరోయిన్ పాత్రను జయచిత్రకు యిచ్చారు. (అమ్మాజీ కుమార్తె) ఆ చిత్రం పూర్తిగాకుండానే, జయచిత్రకు మరో నాలుగు చిత్రాలు వచ్చాయి.

[దాసరి దర్శకత్వంలో నటిస్తున్న రెండు చిత్రాలు "యవ్వనం కాటేసింది, స్వరాజ్యం లేచిపోయింది", పి. సి రెడ్డి దర్శకత్వంలో నటిస్తున్న "తాళికట్టి మాడు"; విక్టరీ మధుసూదనరావు దర్శకత్వంలో నటిస్తున్న "దూరపు కొండలు"]

"పొగ్గాడు" చిత్రం విడుదలయిన తర్వాత జయచిత్రకు తెలుగు మార్కెట్టు ఆశాజనకంగా వుండగలదు



"స్వామి ద్రోహులు"లో ఒక దృశ్యం

పువ్వురేకుల-తాజా తనంలా జై
మిమ్మల్ని చాలా-ఆహ్లాదకరంగా ఉంచుతుంది.



సౌందర్యపు మెరుగులతో జై




సౌందర్య సబ్బు మల్లెపూల వాసనతో

టాటా ఉత్పత్తి

OBM 2067 TL

# సినిమా



"మహాకవి క్షేత్రయ్య"లో ఒక దృశ్యం

### అద్భుత [illegible]

ఈ మధ్య ఒకరోజున "మహాకవి క్షేత్రయ్య" రికార్డింగ్ జరుగుతున్న తరుణాన, దర్శకుడు పి. ఎస్. రావ్ గూర్చి ఒక గమ్మత్తయిన కథను వివరించారు, అద్భుత అదేమిటన.

రాజరాజనరేంద్రుడు భారత ఆంధ్రీకరణ భారాన్ని ఎవరు నిర్వహించగలరనేది సందిగ్ధంలోనడి, తన ఆస్థాన కోవిదులిద్దరిని దేశాటనం పంపారు. (నన్నయభట్టు ఆంధ్రీకరణ చేస్తూ దివంగతులయినప్పుడు ఆయన భారాన్ని నిర్వహించగల కవికోసం అన్వేషణ ప్రారంభమైంది).

వారి అన్వేషణలో వేశ్యయింట విందారగిస్తున్న తిక్కనకవి సమర్థుడు అని తెలిసి, ఆయన కడకు వెళ్ళి నన్నయ రాసిన కవితను చూపెట్టారు. తాంబూలం ఆరగిస్తున్న ఆ కవి, ఆ కవితను ఎర్ర రంగుతో ఆట్రం పరచారు.

ఆగ్రహించిన రాజదూతలు అవమానానికి గురి అయిన దృశ్యాన్ని తిక్కన వారించి "నే చేసిన పనిని మీ రాజుగారికి చూపించండి" అని ఆదేశించారు.

రాజప్రతినిధులు రాజరాజ నరేంద్రుని సమీపించి, తిక్కనగారినే ఎంగిలిరంగు పడిన ఆ కవితా పత్రాన్ని హాజరు పరచారు.

నరేంద్రుడు నవ్వి "ఆ కవిని పిలిపించండి. అతడొకడే భారతాంధ్రీకరణకు సమర్థుడు" అని పూరుకోక, నన్నయ రాసిన దానిని మరెంత రమణీయంగా రూపొందించగల వనేది అర్థం తిక్కన చేష్టలో ఇమిడియున్న దైనాన్ని విపులీకరించారు.

### తిక్కనను బోలిన రావు

అదే వందాన మహనీయుడు ఆరుద్ర స్వర్గస్థుడయిన సమయాన, అంజలీ పిక్చర్స్ అధినేత ఆదినారాయణరావుకు "క్షేత్రయ్య"ను పూర్తి చెయ్యగల సమర్థుడు ఎవరా అనేది సమస్య మొలకెత్తింది.

పి. ఎస్. రావ్‌కు "క్షేత్రయ్య" బాధ్యత అప్పగించబడింది. ఆయన "మహాకవి క్షేత్రయ్య"ను మధుర మనోహరంగా మలచగల ప్రజ్ఞావంతుడు అనేది నిజం పరిశ్రమలోబాటు ప్రేక్షకులకు కూడా తెలుసు.

### అర్ధనారీశ్వరం

"మహాకవి క్షేత్రయ్య" చిత్రంలో అర్ధనారీశ్వరం నృత్య గీతం ప్రత్యేక ప్రశంసలకు పాత్రమయ్యేరీ తధ్యము అనిపించింది, మంజుల నాట్యం నిర్వహించిన అభినయకౌశలం.

ఈ చిత్రంలో వినిపించే ప్రతి పాట మధురానుభూతిని కలిగించే విధంగా ఆదినారాయణరావు సంగీతం సమకూర్చబడింది.

"క్షేత్రయ్య"గా అక్కినేని మన కళ్లముందు ఆ మహాకవిని తీసుకొచ్చారా అనిపించారు.



"నారద వినోదం"లో రాజకుమార్, మంజుల

అక్కినేని ప్రారంభ చిత్రం ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించగలదు ముఖ్య పాత్రధారులుగ అంజలీదేవి, మంజుల, జయసుధ, ప్రభ, కృష్ణకుమారి, హేమలత, రాధాకుమారి, రాజబాబు, కాంతారావు, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, గిరిబాబు, ధూళిపాళ వారి పాత్రలకు పూర్తి న్యాయం చేశారు.

పి. ఎస్. రావ్, స్వామి, ఆరుద్ర, ఆదినారాయణ రావుగార్ల సమిష్టి కృషి చిత్రం ఆద్యంతం అగుపిస్తుంది.

### రామారావు దర్శకత్వంలో నాగేశ్వరరావు

ఆంధ్రుల అగ్రనటుడు, మరుజన్మ పొందిన భాగ్యవంతుడు అగు నాగేశ్వరరావు కథానాయకుడుగా నటిస్తున్న చిత్రాన్ని, రామారావు డైరెక్ట్ చెయ్యబోతున్న వార్త పాఠకులకు తెలుసుమని చెప్పారు, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అధినేత.

### అన్నపూర్ణాలో షూటింగు!

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించబోయే చిత్రం హైదరాబాద్ అన్నపూర్ణ స్టుడియోలో తయారవుతుంది.

ప్రస్తుతం పి. ఎ. పి. నిర్మిస్తున్న చిత్రం షూటింగు సారథీ స్టుడియోలో పూర్తవుతోంది.

ప్రత్యగాత్మ దర్శకత్వంలో రామకృష్ణ, జయసుధ, ప్రభ, రాజబాబు, కృష్ణకుమారి మరియు నాగభూషణం ప్రధాన పాత్రలను పోషిస్తున్నారు. భమిడిపాటి, చలపతిరావు, జి. వి. సుబ్బారావు, సెల్వరాజ్ ముఖ్య సాంకేతిక సారధులు. నవయుగ విడుదల.

### అగ్రనటి ద్విపాత్రాభినయం

మందారం మూవీస్ నిర్మిస్తున్న వర్ణ చిత్రం "దొరలు—దొంగలు"లో అగ్రనటి ద్విపాత్ర పోషణ అద్వితీయంగా వున్నట్టు, రష్ చూచినవాళ్ళు వ్యక్త పరిచారు.

రాణిగా, రంగిగా వైవిధ్యం వున్న రెండు పాత్రల వ్యత్యాసాన్ని విశిష్టంగా చూపెట్టగల అద్భుత వాణిశ్రీకి గాక మరెవ్వరికీ వుంటుంది.

### రామకృష్ణ బహు పాత్రాభినయం

అదే వర్ణ చిత్రంలో కథానాయక పాత్రధారి రామకృష్ణ బహు పాత్రలను పోషించడం జరిగింది. అన్ని పాత్రలను ప్రతిభావంతంగా పోషించినట్లు వార్త.

"దొరలు—దొంగలు" చిత్రానికి 'మల్లెమాల' గారి మాటలు—పాటలు మధుర మధురంగా వున్నాయని, సత్యం సంగీతం మధుర మనోహరంగా వున్నదని, సెట్ల వైభవం వర్ణనాతీతమని, చిత్ర వీక్షకులు వెల్లడించారు.

ఈ కాస్ట్లీ చిత్రానికి కె. ఎస్. ఆర్. దాస్ దర్శకుడు. విజయా పంపిణీదారులు.



''ఆస్తికోసం''లో రామకృష్ణ, ప్రమీల



''సోగ్గాడు''లో ఒక దృశ్యం

## రాజ్యలక్ష్మిలో దీవార్

మద్రాస్ త్యాగరాయనగర్‌లోని రాజ్యలక్ష్మి థియేటరు గల ఆఫీస్‌లో నవంబర్ 17వ తేదీ ఒకటే కోలాహలం ప్రముఖ వ్యక్తులు వి బి రాజేంద్రప్రసాద్, డి రామానాయుడు, వై వి రావ్, డి వి నరసరాజు, ధూండేశ్వరరావు, శారదా ఎంటర్‌ప్రైజస్ అధినేత ఆనంద్‌బాబు మున్నగు వారు కార్లల్లోంచి దిగడం చూచేసరికి, విషయ మేమిటో తెల్సుకుందామని వెళ్లాను ప్రాంగణం లోనే దర్శకుడు యస్ డి లాల్, నిర్మాత శ్రీధర రావు ఆహూతులకు స్వాగతం చెప్పి లోనికి ఆహ్వా నిస్తున్నారు ఇంతలో మెరుపులా ప్రత్యక్షమయ్యారు నటరత్న నందమూరి, వారి సోదరులు త్రివిక్రమ రావు బెల్‌బాటమ్ పాంట్, బ్లూ కలర్ కోట్‌లో రామారావుగార్ని చూచి ఆశ్చర్యపోయాను వయస్సు ముదిరేకొద్దీ కుర్రాడిలా తయారౌతున్నారు నందమూరి ఏభై దాటినా ఏమాత్రం తగ్గని అందంతో మిసమిసలాడుతూ కన్పించారు ఎన్ టి ఆర్

ఇంతలో రాజ్యం ప్రొడక్షన్స్ అధినేత లక్ష్మి రాజ్యంగారు పూజకు రండి, అన్నీ సిద్ధంగా వున్నా యంటూ ఆహ్వానించడంతో పైకెళ్లి పూజను పూర్తిచేసారు రామలక్ష్మణు లిద్దరూ (నటరత్న, త్రివిక్రమరావు) ''అమ్మాయ్ మంజులా రామ్మా'' అంటూ లక్ష్మిరాజ్యంగారు పిలవడంతో నటరత్న ప్రక్కన చేరింది గ్లామర్ క్వీన్ మంజుల

ఇలావుండగనే ''షాట్'' రెడీ సార్ అంటూ కెమెరామన్ శ్రీకాంత్, దర్శకుడు యస్ డి లాల్ పిలవడంతో కెమెరా ముందుకెళ్లారు ఎన్ టి ఆర్ 'మీ పని అయిపోయింది నాడబ్బు నాకిచ్చెయ్యండి'' అనే డైలాగ్‌తో స్టార్ట్ అయింది షూటింగ్ త్రివిక్రమరావుగారు క్లాప్ కొట్టగా, సుందర్‌లాల్ నహతాగారి కుమారుడు కెమెరా స్విచ్ ఆన్‌చేయగా పై ఫస్ట్ షాట్‌ను షూట్ చేసారు దర్శకుడు యస్ డి లాల్

విఖ్యాత వాణిజ్యవేత్త సుందర్‌లాల్‌నహతాగారి అధ్వర్యంలో జరిగిన ఈ సంరంభం ఎందుకను కున్నారు? రాజ్యం ప్రొడక్షన్స్ వారు హిందీలో హిట్ అయిన ''దీవార్'' చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తున్న సందర్భంగా పై సమావేశం జరిగింది

అమితాబ్‌బచన్ పాత్రలో ఎన్ టి ఆర్, శశికపూర్ పాత్రలో రామకృష్ణ కన్పించే ఈ చిత్రంలో మంజుల, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, లత, అంజలీదేవి ముఖ్య తారాగణం

కె వి మహదేవన్ సంగీతం, బి చలం కళ, శ్రీకాంత్ కెమెరా, డి వి నరసరాజు మాటలు సమకూరుస్తున్న ఈ చిత్రం రాజశ్రీ విడుదల

## సత్యం పలికిన సంగీత

''ముత్యాలముగ్గు'' చిత్రంలో మహాలక్ష్మిగా సాక్షాత్కరించి, ముద్దుగా నటించి, ప్రేక్షకుల మనసును దోచుకున్న సంగీతను, యిటీవల ''పెద్దన్నయ్య'' చిత్రం ప్రారంభంనాడు కలిసాను.

ఆమెను నేనడిగిన ప్రశ్న ''అంత హిట్ చిత్రంలో నాయికగా నటించి, పేరు తెచ్చుకున్న మీరు తక్కువ చిత్రాల్లో కనిపించడానికి కారణం?''

తనే కారణం అంది ఆవిడ అన్ని చిత్రాల్లో నటించి, వచ్చిన పేరును పోగొట్టుకోవడంకన్నా, నచ్చిన పాత్రలను పోషించి ప్రేక్షకులతో ఎక్కువ బంధుత్వం పెట్టుకోవాలన్నదే తన అభిమతంగా చెప్పింది

''పెద్దన్నయ్య'' చిత్రంలోని తన పాత్రకు ప్రేక్షకుల సింపతీ లభించగలదనేది ఆమె అభి ప్రాయాన్ని, ఆ చిత్ర దర్శకుడు పి డి. ప్రసాద్ బలపరచారు

''కళావాచస్పతి'' జగ్గయ్యగారి అర్ధాంగిగా సంగీత నటిస్తున్నది

— శ్రీనివాస్

## ఊరంతా హోరు

**డా॥ సి. నారాయణరెడ్డి**

ఊరంతా హోరు
మొన్నటి వరదల్లో నా
కున్నదంతా పోయిందని
మల్లెమొగ్గలాంటి యిల్లు
రేకుల్లాంటి గోడలు
ఎదిగిన ఎదల్లాంటి గదులు
ఒదిగిన ఊహల్లాంటి బీరువాలు
కాలాల గాలాలకు లొంగని
గ్రంధాల మీన బృందాలు
ఇన్నిటినీ మించిన నన్నజాజిమొక్క
ఈమధ్యే పెంచుకున్న చిన్నారి కుక్క
మొన్నటి వరదల్లో మొత్తానికే
మునిగిపోయినాయని

ఒకే పుకారు
ఊరంతా హోరు.
నిజం
వాన నిజం — వచ్చిన
వరద నిజం
కలత నిజం — రెచ్చిన
కల్లోలం నిజం
మొత్తం మునిగిపోయినా మిగిలినవి
మూర్తీభవించిన దీప్తులు రెండు.
అన్నీ ఆరిపోయినా రగిలినవి
అశ్రాంత శక్తులు రెండే రెండు
నిర్మించే కలం +
గర్జించే గళం




# బంధుప్రీతి!

వి.వి.ఎస్.బి. కుటుంబరావు

**కోటేశ్వరరావు - రామకోటేశ్వరరావింటికి వచ్చాడు కోటేశ్వరరావుకు - రామకోటేశ్వరరావు దూరపు బంధువవుతాడు.**

అయినా కోటేశ్వర్రావు కిబ్బందేమీ లేదు! అతనికి బంధుప్రీతి చాలా ఎక్కువ! అందుకని ... బంధుకోటి ఎక్కడెక్కడున్నారో చాలా ఓపికగా వాకబుచేసి మరీ...వాళ్ళింటికి వెళ్ళి పలకరించి నాలుగు రోజు లుండి వస్తుంటాడు.

రామకోటేశ్వర్రావుకుకూడా బంధుప్రీతి అంత ఎక్కువగాను ఉన్నట్లుంది! దూరపు బంధువయినా రాకపోకలు ఎక్కువగా లేకపోయినా కోటేశ్వర్రావును చాలా బాగా ఆదరించాడు. ఆహార పానీయాది అతిథి సత్కారాల విషయంలో తన భార్యకు చెప్పి ప్రత్యేకంగా తయారు చేయించాడన్నీ. ఆ ఏర్పాట్లకు ముగ్ధుడయిపోయాడు కోటేశ్వర్రావు. బంధువుల ఇళ్ళల్లో సర్వసాధారణంగా కనుపించే విసుగు, చిరాకు ఈ యింట్లో మచ్చుకైనా కాన రాకపోవటం ... పైపెచ్చు తనను రామకోటేశ్వర్రావు దంపతులు, "అతిథి దేవోభవ!" అన్నట్లుగా చూడటం చూసి ... కోటేశ్వర్రావు — ఆహా! నా అదృష్టమే అదృష్టం! ఇలాటి బంధువులుంటే నా జీవితానికింకా కావలసిందేముంది?" అనుకుని యమ సంతోషపడిపోయాడు.

అసలు కోటేశ్వర్రావేం ఉద్యోగం చేస్తాడో ఇదమిత్థంగా ఎవరూ తేల్చిచెప్పలేరు! కాని, అతను నెలకు ముప్ఫయ్ లేక ముప్ఫయ్ ఒక్క రోజులూ టూర్‌లోనే వుంటాడు. ఎక్కువగా బంధువుల ఇళ్ళలోనే దిగుతాడు. బంధువులు లేనిచోట మాత్రం స్నేహితుల ఇళ్ళను పావనం చేస్తుంటాడు. యాభయ్ ఏళ్ళ బ్రహ్మచారి! బాదరబందీ ఏమీ లేదు. అసలతనికి డబ్బు సమస్య వున్నట్టే కనిపించదు. మల్లె పువ్వులాంటి తెల్లటి గ్లాస్కో పంచె, గ్లాస్కో లాల్చీ, దానికింద మాటీ బనీను, గోల్డుచైను రిస్ట్ వాచీ, చేతిలో గోల్డుఫ్లేక్ ఫిల్టరు సిగరెట్టు, మరో చేతిలోని బ్రీఫ్‌కేసు. బట్టతల మీద దువ్విన ఓ ఏది పదహారు వెంట్రుకలతో, ముఖంమీద వీడని చిరునవ్వుతో ఎప్పుడూ చిద్విలాసంగా వుంటాడు. మాటకారి గనుక అవతలివారి నిట్టే ఆకర్షిస్తుంటాడు.

వేడినీళ్ళ స్నానం చేసేటప్పుడు, "అతిథులకు వేడినీళ్ళు సమకూర్చినవాడి జీవితం చల్లగా చల్లారిపోక ఎప్పుడూ వేడిగా వాడిగా వుంటుందోయ్!" అంటూ దీవించాడు రామకోటేశ్వర్రావును. అతను తనకన్నా వయస్సులో చిన్నవాడుకదా మరి!

షడ్రసోపేతమైన భోజనం ఆరగించేటప్పుడు "మీ యిల్లు ఎప్పుడూ యిలా నాలా వచ్చేపోయే అతిథులతో అలరారుగాక! నువ్వు రంతిదేవుడిలా... నీ భార్య కాశీ అన్నపూర్ణలా వెలుగొందుగాక!" అంటూ ఆశీర్వదించాడు.

దానిలోని అర్థం అర్థమయ్యిందో లేదోగానీ... "మహాప్రసాదం!" అని కోటేశ్వర్రావు దీవెనను శిరసావహించాడు రామకోటేశ్వర్రావు.

తాంబూలం సేవించి, సుఖమైన పక్కమీద శయనిస్తున్నప్పుడు ... "అన్నదాతా! సుఖీభవ!" అని రామకోటేశ్వర్రావు తలనిమిరి, అతని బంధుప్రీతిని తెగపొగిడి ... బంధుజన సత్కారం రాను రాను దేశంలో ఎలా అంతరించిపోతోందో ... చుట్టాలు — కాట్లకుక్కలై రాకపోకల విషయంలో ఎలా పోట్లాడుకుంటున్నారో ...? దానివల్ల గృహస్థులకు మోక్ష సామ్రాజ్యం సిద్ధించకుండా ఎలా దూరమైపోతోందో...! అన్న విషయంపై భార్యాభర్తలిరువురికీ — తన వాక్పటిమ, చమత్కార మధురిమలతో అరగంటసేపు అనర్గళంగా ఉపన్యాసమిచ్చి ... అదయిపోయిన తర్వాత ఓ గ్లాసుడు పాలు తెప్పించుకుని మరీ తాగి ... గుర్రుకొట్టి నిద్రపోయాడు కోటేశ్వర్రావు!

రెండు ... మూడు ... నాలుగురోజులు గడిచిపోయినా — రామకోటేశ్వర్రావు దంపతుల మర్యాద మన్ననల విషయంలో గాని ... వసతులు ... ఏర్పాట్ల విషయంలో గాని తేడా ఏమీ కనిపించటంలేదు కోటేశ్వర్రావుకు. ఆశ్చర్యంతో ఆ విషయాన్ని పరిశీలించటానికన్నట్లుగా యింకా మూడురోజులెక్కువుండి ... సుష్టుగా తిని ... ఇంకో పదిసార్లు పొగిడి ... రామకోటేశ్వర్రావు దంపతుల దగ్గర శెలవు పుచ్చుకుని ... "మళ్ళీ ఈసారిటువైపు వచ్చినపుడు తప్పకుండా వస్తాను. ఈసారి వట్టిచేతులతో మాత్రం రాను!" అని చెప్పి స్టేషనుకు బయలుదేరాడు కోటేశ్వర్రావు.

రామకోటేశ్వర్రావు కూడా పాపం చాలా ఇదయి పోయాడు, కోటేశ్వర్రావు వెళ్ళిపోతుంటే.

"దూరపు బంధువయినా మీ రాకతో మా యిల్లు ఏదో కొత్త కళను సంతరించుకొందని... మీ బోధలు... ఉపన్యాసాలు... మాబోటి పిన్నలకు మార్గదర్శకాలని ... మీబోటి పెద్దలు — అనుభవజ్ఞులయిన అతిథుల రాకతో మా గృహం పావనమయిందనీ ... మా జన్మ తరించిందనీ ...! అసలు మీబోటి బంధువులు తరచు మాయింటికి దయచేయాలని నేనాశిస్తుంటా"నని చెప్పి, గౌరవ సూచకంగా ఒకటికి పదిసార్లు నమస్కారాలు పెట్టాడు.

రైలు స్టేషను దగ్గర రిక్షా దిగి ... రిక్షా వాడికి డబ్బులిచ్చి పంపించేసి ... యదాలాపంగా బ్రీఫ్‌కేస్ తెరిచి ... అందులో తను భద్రపరచిన వెండిగిన్నె వైపు ప్రేమగా చూసి ... రామకోటేశ్వర్రావు దంపతులను తలచుకొని ... తృప్తిగా నిట్టూర్చాడు కోటేశ్వర్రావ్!

"పెద్దవాణ్ణి తననెలా అనుమానించగలరు? చివరకిది ఏ పనిమనిషి మీదకో వస్తుంది — అంతే! అదృష్టమంటే అదృష్టం తనది! నెల మొత్తం యిలా బంధువు లిళ్ళల్లో చుట్టపుచూపుగా గడపటం! సుష్టుగా మెయ్యటం! వచ్చేటప్పుడు వారి కనుమానం కలక్కుండా ఇలాంటి వస్తువేదో చేతబుచ్చుకురావటం! ఉద్యోగంచేసి సంపాయిస్తుంటే మాత్రం యింత సౌఖ్యం లభిస్తుందా?"

బ్రీఫ్‌కేసు మూసివేసి ... రైలు టిక్కెట్టు

## ప్రశ్నావళి — కె. రామలక్ష్మి

సి. సి. పి. — గుల్బర్గ

మెన్ కెనాట్ స్టాండ్ ఇంటలిజెంట్ విమెన్?

★ వెరీ ట్రూ మైడియర్ వాట్ సన్! వెరీ ట్రూ. కాని చూశారో లేదో -- తెలివైన వాడాన్ని త్రోసిపుచ్చుతారేగాని, వాలుచూపులకి దాసోహం పడతారు!!

ఎస్. పి. ఆర్. — కలకత్తా

మీకు నరకం తప్పదని నాకు చాలా బాధగా వుంది అక్కయ్యగారూ!

★ మరేం బాధపడకు బ్రదర్, ప్రపంచ జనాభాలో సగం అక్కడే ప్రస్తుతం బ్రతుకుతూ వున్నారు.

కె. ఎన్. ఆర్. — అనకాపల్లి

మీరు జీవితంలో సాధించినవేమిటి?

★ ఇంకా ఏంలేదు.

అన్నిటికంటే పురుషునికి కష్టమైనదేమిటి?

★ పెళ్లాం మాట వినవలసిరావడం!

ఆర్. యు. బి. ఎస్. — ఏలూరు

పిచ్చి అక్కయ్యా, నాలాంటి తమ్ముళ్లు వేసే ప్రశ్నలకు నవ్వులపాలు అయ్యేవిధంగా సమాధానం చెప్పినంత మాత్రాన...

★ వెర్రి నాన్నా, ఎవరు నవ్వులపాలయ్యేలా?! చెప్పకుండా ఏమిటీ ప్రశ్న?

ఎమ్. ఎ. హెచ్. — కందుకూరు

ఆడవాళ్లు ఎంత ముందుకొస్తున్నారో, అంత దిగజారిపోతున్నారనుకుంటాను.

★ మేం అలా అనుకోవడంలేదు.

వి. జె. ఎస్. — భువనేశ్వర్

పవిత్రత ఆడవారికే కాదు మగవారికికూడా వుండాలి అన్న మీ మాటలతో ఏకీభవించలేను. పవిత్రంగా అంటే మగవాడుకూడ ఆడదానిలా వంటచేస్తూ కూర్చోవాలంటారా?

★ పవిత్రత అంటే వంట చేయడమేనా స్వామీ, నేనింకా ఏదో అనుకున్నాను.

జి. ఎస్. - కావలి

జీవనజ్యోతికి మూలకథ మీరు రాశారట. అది ఎందులోనూ చదివినట్టు గుర్తులేదు...

వై. ఎస్. — మెదురు

జీవనజ్యోతి మీరు రాసిన నవలే అనుకుంటున్నారు ... ఎంతవరకు నిజమో తెలుపగోరుతాను.

సి. హెచ్. ఎల్. ఎన్. ఆర్ - గుడుగుంట్లపాలెం

మీ జీవనజ్యోతి సినిమా కథలో యెన్నో వాస్తవిక సంఘటనలున్న మాట నిజం...

డి. ఎన్. ఆర్. — సిద్దిపేట

మీ జీవనజ్యోతి విజయానికి కారణం?

సి. హెచ్. ఎస్. డి. బి. — మచిలీపట్నం

మీ ఆడది చదివాను. నవలకూ జీవనజ్యోతి చిత్రానికి పోలికలేదు.

★ ఎలా వుంటుంది — రెండు ఒకటికాదు! జీవనజ్యోతి సినిమాకని రాసిన కథ. మూలకథ అని వేయడానికి కారణం — కామెడీ నేను రాయలేదు కనుక! యిక విజయవంతమైన చిత్రానికి — అందరూ కారకులేకద! చాలామంది ఈ గొడవ రాశారు. చిన్న తికమకలోపడ్డవారి కిదే నా సమాధానం. 'ఆడది' నవల కొన్నది శ్రీ డి. వి. ఎస్. రాజుగారు. జీవనజ్యోతి నిర్మాతలూ వారే. అంతే గాని వేరేం కాదు. ఇది విడిగా రాసుకున్న కథ. దర్శకుని ప్రతిభవల్ల అంతగా రాణించిందని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

ఎస్. జె. — హైద్రాబాదు

స్త్రీ ఎప్పుడూ తన భర్త తనకంటే విద్యావంతుడూ, అధిక సంపాదనాపరుడుగా వుండాలని కోరుకుంటుంది. ఇలా తనకు తానే తన జాతిని కించపరుచుకుంటున్నప్పుడు, ఇక మగవాళ్ళపై నింద మోపడం ఎందుకు?

★ చేతకాక! సోదరీ, ఒక సంగతి మరిచిపోకు — తన భర్త తనకన్న తక్కువ చదివినా, సంపాదన వున్నా లేకపోయినా. సంసారం సౌమ్యంగా సాగిపోతే చాలుననుకుంటుంది — సహజంగా ఆడది. కాని సాటి స్త్రీల దృష్టిలో చులకన అవుతానన్న భయం, దెప్పుతారన్న పిరికితనం, ఆడదాన్ని — సాధించిపోసేలా చేస్తాయి. అంచేత తమరన్న — ఆపై మెట్టు కోరిక - మన లోపంగాని, నింద ఎవరిమీదో మోపడం దండుగ. మీవారు మీకంటే తక్కువ చదివారటగా?' అంటూ సాగతీసేది సాటి ఆడదేగాని మగవాడు కాదు. [50వ పేజీ చూడండి]

## యువతరం

శ్రీరాముని పట్ల ఆంజనేయులికి వున్న భక్తిప్రపత్తులు ఎటువంటివో ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ పట్ల శ్రీ సుబ్బారావుకి వున్న భక్తి అటువంటిది ఉదయం లేవగానే ప్రధాని ఇందిర ఫోటోని చూచి తరువాతదైనందిన కార్యక్రమాలలో దిగుతానని శ్రీ సుబ్బారావు తెలియచేశాడు. ఇటీవల ఢిల్లీవెళ్లి శ్రీమతి ఇందిరా గాంధీని సందర్శించి వచ్చాడు. తిరుపతిలో శ్రీ వెంకటరమణ మూర్తిని సందర్శించినపుడు కలిగిన అనుభూతిని "ప్రధాని ఇందిరను సందర్శించినపుడు పొందాను" అని శ్రీ సుబ్బారావు అన్నాడు.

పూర్తి పేరు శ్రీ వడ్లమాని వెంకట సుబ్బారావు. అనకాపల్లి, ఎ. ఎమ్. ఎ. ఎల్. కళాశాలలో ఫైనల్ బి. ఎ. చదువుతున్న సుబ్బారావు "ఇందిరా యువజన కాంగ్రెసు" అనే సంస్థను స్థాపించి, దానికి రాష్ట్రం అంతటా శాఖలు స్థాపించే కృషిలో ప్రస్తుతం వున్నాడు. విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనడం అవసరమే అయినా విద్యకు భంగం కలుగరాదు అని అన్నాడు.

21 సంవత్సరాలు వయసు కలిగిన శ్రీ సుబ్బారావుకి ప్రేమ వివాహం పట్ల అభిమానం లేకపోయినా "దురభిమానం లేదు" అన్నాడు. వర కట్నాల దురాచారానికి పురుషులూ, స్త్రీలూ కూడా సమాన బాధ్యులే అనేది శ్రీ సుబ్బారావు అభిప్రాయం. తీరికయినపుడల్లా తెలుగు సినిమాలు చూస్తానని అన్నాడు. ప్రస్తుతానికి తెలుగు సినిమాలు బాగానే వుంటున్నా సమాజానికి ఉపయోగపడే విధంగా సినిమాలు తీయాలి, అన్నాడు. "లా" చదివి, దాని ద్వారా బీద ప్రజానీకానికి సేవ చేయడం తన జీవిత లక్ష్యం అని శ్రీ సుబ్బారావు అన్నాడు.

[ జి. యస్. ]

---

కొందామని జేబులో చెయ్యి పెట్టాడు కోటేశ్వర్రావు.

ఆశ్చర్యం! పర్సు లేదనికాదు కోటేశ్వర్రావు ఆశ్చర్యానిక్కారణం! ఉంది! పర్సు వుంది! నిక్షేపంలా వుంది! కానీ ... పూరీలాంటిది చపాతీలా చిక్కిపోయి తగిలింది చేతికి! ఆదుర్దాగా పర్సుతీసి తెరచి చూశాడు.

అందులో ఆకుల మాటున పిందెలా నోట్ల మధ్య ఓ చిన్న తెల్లకాగితం చీటీ వుంది! అందులో యిలా వుంది.

"పూజ్యులు ... పరమ గౌరవనీయులు .. కోటేశ్వర్రావుగార్కి—

మీ పర్సులో వున్న మొత్తం డబ్బు రెండు వందల] ఇరవై రెండు రూపాయలు! ఈ వారం రోజులు మీరు మా యింట్లోపడి మేసిన అతిథి సత్కారం విలువ, మా సర్వింగ్ ఛార్జెస్‌తోసహా కలిపి వందరూపాయలు! మీరు ప్రేమగా తీసుకెడుతున్న మా వెండిగిన్నె తాలూకు కనీసపు ఖరీదు యాభై రూపాయలు! పోతే మిగిలిన డబ్బు డెబ్బయ్ రెండు రూపాయలు! మీ పర్సులో భద్రంగా ఉంచుతున్నాను. "అతిథి దేవోభవ గదా మరి!" పోతే... మళ్ళీ మళ్ళీ మీ రాకకోసం పదే పదే ఎదురు చూస్తుంటాము! మీ దీవెనలు, అమూల్యమయిన ఆశీస్సులు మాకెప్పుడూ వుంటాయని తలుస్తాను! నేనెవరో రాయనక్కరలేదనుకుంటా! సంతకం చేయటం బాగుండదని చేయటంలేదు.

ఇట్లు,

ఉచిత సత్కారాలు చేయలేని మీ పేద బంధువు.

"బాప్‌రే! నాపేరే (కే)టేశ్వర్రావయితే వీడి పేరు పరమ కేటేశ్వర్రావులా వుందే! మొత్తానికి నన్నే ఛమ్కీ తినిపించాడు!" అనుకుని ముఖమంతా చెమటపట్టిన కోటేశ్వర్రావ్— ఇకనుంచీ యిలాంటి బంధువుల ఇళ్ళకు వెళ్లేటప్పుడు తనకుకూడా జేబు జాగ్రత్త అవసరం! అనే నిర్ణయానికొచ్చి గబగబా టికెట్ కౌంటరు దగ్గర కెళ్ళాడు దూరం నుంచి రైలు కూత వినిపించింది.

# సామాన్యుని సణుగుడు

**బె**జవాడలో — మూడ్రోజులు జరగవలసిన రంజీ ట్రాఫీ క్రికెట్ మ్యాచ్‌ని రెండు రోజుల్లోనే ఆంధ్ర జట్టు నుంచి తమిళనాడు వెంకటరాఘవన్ జట్టు తన్నుకుపోయింది. ఆదివారంనాడు "ఆట విడుపు" దొరికిన పట్నవాసపు జనాభా చూడకుండానే రెండోరోజునే ఒక యిన్నింగ్స్ కూడా పూర్తిగా ఆడకుండానే తమిళనాడు ఆంధ్రాస్‌ని రెండుసార్లు పెవిలియన్‌కి దొర్లించేసింది — అయ్యో! అని విచారించబోతూంటే వో పెద్దమనిషి: 'పోన్లెం దయిపోయింది కనుక బతికిపోయాం లేకపోతే ఆదివారంనాడు కూడా విజయవాడ కేంద్రం వారు ప్రసారం చేసిన రేడియో తెనుగు ప్రత్యక్ష వ్యాఖ్యానం విని మరుసటి వారమంతా త్రేన్పులు వచ్చి చచ్చేవాళ్లం' అన్నాడు. ఆయన ప్రక్కనున్న గుంటూరు నుంచి యీ వూరొచ్చాడు — కాని ఆదివారంనాడు ఆటయిపోయిందనగానే యింత ఆనందం వెలిబుచ్చాడు—అసలు ఆట 'చూడ్డం'కన్నా దాన్ని వినటం— అందులోనూ కే. శే. "విజ్జీ" లాంటి ఆల్‌రౌండ్ మాస్టర్ చెప్తూంటే వినటం — కోట్లాది శ్రోతలకి మహసర్దా—కాని "కామెంటరీయే! బాబోయ్! కట్టేయ్ రేడియో" అన్న యీ స్నేహితుడు శుక్ర శనివారాలు తెనుగులో విజయవాడ రేడియో క్రికెట్ కామెంటరీ విన్నాడు కనుక అలా అంటున్నాడని నేను గ్రహించాను — ప్రాంతీయ భాషలోనే మనం నడవాలి పరిగెత్తాలి, బస్సెక్కాలి రైలెక్కాలీ అంటున్నారు కదా నీకేమయ్యా! యింత దురభిమానం అన్నా — అదికాదు ఆ తెనుగు కామెంటరీ వింటూంటే మీ వూరు మ్యునిసిపల్ స్టేడియంలో క్రికెట్ "ఫార్సు" లాంటిది జరుగుతూందేమోనని పించింది అన్నాడు. గడగడా తెనుగులో కామెంటరీ చెప్పటం క్రికెట్ విషయంలోనే సాధ్యం — ఫుట్‌బాల్, టెన్నిస్‌లాంటి వైతే యింకా ఎంతో కష్టం — బంతికి బంతికీ మధ్య బోలెడు జోకులు, విట్‌లు వింతలు విశేషాలు కారాలు మిరియాలు అన్నీ నూరే అవకాశం గల యీ క్రికెట్ బెజవాడలో మ్యాట్ మీద మనవాళ్లు ఎంతో కష్టపడి ఆడి వోడారేగాని ఫార్సికల్‌గా మాత్రం కాదు. కాకపోతే శ్రోతలపై ప్రేమతో ఎంతో శ్రమపడ్డ రేడియో వారు మంచి తెనుగు వ్యాఖ్యాతని పెట్టుకునివుంటే అంతర్జాతీయ ఖ్యాతి గల వెంకట్, వెటరన్స్ కుమార్, కళ్యాణసుందరం మొదలైనవాళ్ళు బంతిని చెచ్చెరపిడుగులాగా వదుల్తూవుంటే మనవాళ్లు ఎట్లా[ట] ఆడారో తెలుసుండేది..."విజ్జీ" ది గ్రేట్ పియర్సర్ సురీటా, ఆనందరావు, బెర్రీ మొదలు మన ప్రసన్నకుమార్ దాకా వాళ్లు చెపుతున్నప్పుడు సీరియస్‌నెస్‌ను ఎప్పుడూ కోల్పోని క్రికెట్ కామెంటరీ — తెనుగులోకి వచ్చి మొన్న ఆ సీరియస్‌నెస్‌ను కోల్పోయిందని జనవాక్యం అలాస్! ఎ లాస్ టు ది టీమ్ ఎ లాస్ టు ది లిజనర్స్ [పిరాజీ]

## డాక్టర్ సలహాలు  —డాక్టర్ కె. వెంకటేశ్వరరావు.

ఎమ్. కె. — హైదరాబాద్

నా వయస్సు 19 సం.లు నాకు 5, 6 సం.లుగా గొంతు బొంగురు పోయినది. రాను రాను మరీ ఎక్కువవుతున్నది. ఏదైనా ప్రయాణము చేసినపుడుగాని, బాగా అలసిపోయినపుడుగాని విపరీతముగా బొంగురు పోతున్నది. ఇలా అవటానికి కారణమేమిటి? నివారణోపాయము చెప్పండి.

★ మనం మాట్లాడేటందుకు గొంతు అనబడే భాగంలోని "ఓకల్ కార్డ్స్" అనేవి చాలా అవసరం. ఈ ఓకల్ కార్డ్స్ వాచినప్పుడు — లేక ఎక్కువగా రాపిడి చెంది - వుండు పడినప్పుడు గొంతు "బొంగురు" పోవటం జరుగుతుంది. నిరంతరంగా గొంతు బొంగురు పోవటం — ఈ ఓకల్ కార్డ్స్ — నిరంతరంగా దెబ్బ తిన్నాయనే విషయాన్ని తెలియచేస్తున్నది. యి. ఎన్. టి. వైద్యులు ప్రత్యేక సాధనాలతో వీటిని పరిశీలించి, వాటికి తగిన నివారణోపాయం చెప్పగలరు.

యం. ఎల్. — కడప

నా వయస్సు 38 సం.లు ఒక సం. నుండి బి. పి. విపరీతముగా వచ్చుచున్నది. బి. పి. వచ్చినపుడు తలనొప్పి కూడా వచ్చును. ఎన్ని మందులు వాడినా ఫలితము కన్పించలేదు. ఇది తగ్గించుటకు ఉపాయము తెలుపవలసినదిగా కోరుతున్నాను.

★ రక్తపు పోటు రావటానికి కొన్ని కారణాలు దోహదం చేస్తాయని మాత్రమే ప్రస్తుతం మనకు తెలిసిన విషయం. ఎక్కువగా ఉద్రిక్తులవటం, వాంఛా ప్రవృత్తుల ప్రకోపాలకి గురి కావటం మొదలయినవి తగ్గించుకోవటం, మందులు వాడటంతో బాటుగా చేస్తే చాలామటుకు తగ్గిపోతుంది. ప్రతిక్షణం మనకి "ఇంత" బి. పి. ఉన్నదీ అన్న ఆలోచన, ఆందోళన అనవసరం.

వి. వి. ఎల్. - గంగయ్యపల్లె

నా వయస్సు 25 సం.లు. నాకు 7 సం.ల బాబు వున్నాడు. బాబు పుట్టిన 4వ నెల నుండి నాకు మూత్రము కొన్ని రోజులు బాగా పోతుంది కొన్ని రోజులు పోదు. అపుడు కడుపు ఉబ్బినట్లుండి ఆయాసముగా వుంటుంది. రాయవేలూరులో అబ్డామీన్ టి. బి. అని 15 నెలలు మందులు వాడమన్నారు. తగ్గలేదు. దగ్గు కూడా వస్తుంది. మదనపల్లెలో చూపిస్తే టి. బి, ఆస్తమా కాదు మామూలు దగ్గేనని మందు వాడమన్నారు. ఈ దగ్గు వచ్చి 4 సం.లు అయినది. ఉమ్మిలో తీగ మాదిరిగా వస్తుంది. ఈ జబ్బు వుంటే సంతానము కలగరా?

★ పిల్లలు కలిగిన తర్వాత మూత్రం సరిగా పోకపోవటం, మూత్రం బహిర్గత మవటానికి తోడ్పడే భాగాలు సడలిపోవటం వలననే. ఇక మీకు ఉన్న దగ్గు విషయం — నేరుగా వైద్యులు పరీక్షించి నిర్ణయించాల్సి ఉంటుంది. మీ రోగానికి, పిల్లలు కలుగకపోవటానికి సంబంధం లేదు.

బి. ఎల్. — కోడూరు

మా అత్తగారికి 5 సం.ల నుండి అప్పుడప్పుడు తల తిరుగుట, కాళ్ళు, చేతులు కొట్టుకొని, స్పృహ లేకుండా పడిపోవు లక్షణములు కలవు. మరల నీళ్ళు చల్లి త్రాగించిన ఎడల స్పృహ వచ్చును. దీనికి కారణ మేమిటి? నివారణోపాయము తెల్పండి.

★ మీ అత్తగారి వయస్సు ఊహించుకొని, ఆ వయస్సులో రాగల రక్తపు పోటువల్ల తల తిరుగుడు, పడిపోవటం — అర్థం చేసుకోగలిగినా, కాళ్లు చేతులు కొట్టుకోవటం, నీరు త్రాగగానే స్పృహ రావటం ఈ రోగంవల్ల అయిఉండదు. ఇది "హిస్టీరియా" లక్షణాలని (గతంలోనే వివరించాను) మాత్రమే తెలియచేస్తాయి. ఆవిడకు గల మానసిక బాధలను తొలగించటం లేక కోరికలను తీర్చటం మాత్రమే మీరు చేయకలిగిందల్లా!!

కె. యస్. ఆర్. — కర్నూలు

నేను ఇద్దరు పిల్లల తరువాత 'లూప్' వేయించుకున్నాను. దానివల్ల నాకేమీ బాధ లేదు. ఇది వేయించుకుని 7 సం.లు దాటినది. మార్పించాలా?

★ లూప్ వేయించుకొన్న తర్వాత, ప్రతి 3, 4 సం.ల కొకసారి మార్పించవలసిన అవసరమున్నదని మొదట వేసే సమయంలోనే తెలిపే ఉంటారు. అయినా, ఇంకా ఆ "లూప్" మీ శరీరంలో ఉన్నదని నిర్ధారణగా ఉంటే తప్పకుండా క్రొత్తది వేయించుకోవటం మంచిదే!

పి. జి. పి. — కర్నూలు

మా ఆడపడుచుకు 7 సం.ల క్రితం పెళ్లి చేశాము. 3 నెం.ల వరకూ భర్త దగ్గర కాపురం చేయటానికి ఇష్టపడలేదు మెంటల్‌గా దెబ్బతిన్నది. హాస్పటల్‌లో కొద్ది నెలలు ట్రీట్‌మెంటు ఇప్పించాము. ఇప్పుడు కాపురం చేస్తోంది. కానీ ప్రతి సంవత్సరమూ గర్భిణీ సూచనలు కన్పిస్తాయి. 4, 5 నెలలు నిండకముందే అబార్షన్ అయినట్లవుతుంది. లేడీ డాక్టర్‌కి చూపిస్తే గర్భిణీ కాదు అన్నారు. డి అండ్ సి గూడా చేయించాము. ఎన్నో మందులు, టానిక్కులు, ఇంజక్షనులు వాడాము., కాని మళ్లీ అలాగే అవుతోంది.

★ మీరే ఆమె "మెంటల్" అని వ్రాశారు గనుక ఎవరైనా చేయగలిగింది — తాత్కాలికంగా ఆమె బాధలు పోగొట్టడానికి మందులు ఇవ్వటమే! కాని "మెంటల్"గా బాధపడేవారు గర్భిణీలు గారని ఏదీ సిద్ధాంతం లేదు.

# కాలుష్యం కథ

క.వ.న.శర్మ




దేశాయి "బుద్ధి గడ్డితిని డబ్బు ఈ ఫాక్టరీలో పెట్టాను. మద్రాసీ సినిమామీద పెట్టివుంటే ప్రాణానికి సుఖంగా ఉండును." అనుకున్నాడు. అతగాడా రోజున అల్లా అనుకోడం పదోసారి.

''చేతులు కాలాక ఆకులు పట్టుకుని లాభం ఏమిటి నిరంజన్? నీకు అప్పుడే చెప్పాను. నువ్వు వినలేదు'' అన్నాడు పటేల్.

''నిజమే సంజయ్! బుద్ధి గడ్డితిని వినలేదు.''

''ఇవాల్టికిది పదకొండోసారి, నువ్వా మాట అనటం మరోసారి ఆ మాటంటే ఒప్పుకోను. అదొదిలేసి, అసలిప్పుడేం చెయ్యాలో ఆలోచించు'' అంటూ మందలించాడు సంజయ్‌పటేల్, నిరంజన్ దేశాయిని.

సంజయ్‌పటేల్, నిరంజన్ దేశాయి కలిసి ఏడేళ్లక్రితం ఏదైనా వ్యాపారం చేద్దామనుకున్నారు. ఆ పైన ఏదైనా పరిశ్రమకి పెట్టుబడి పెడదామనుకున్నారు. అప్పుడు సంజయ్ పటేల్ మద్రాసి సినిమాల్లో డబ్బూ, సుఖం కూడా ఉందని నిరంజన్ దేశాయికి చెప్పాడు. ''ఆడవాళ్లు కావలసివస్తే, మన రాష్ట్రం గొడ్డుపోయిందా! మద్రాసీ సినిమా తారలకి మనవాళ్లేం తీసిపోయారు'' అంటూ దేశాయి దేశభక్తి గీతం పాడాడు. పటేల్ మరి మాట్లాడలేదు. పటేల్‌కి తనకేం కావాలో తెల్సు. ప్రస్తుతం అతనికి దేశాయి తాలూకు పెట్టుబడి కావాలి. అందుకని మద్రాసీ తారల్ని మనసులో అసింటా నెట్టాడు.

పటేల్, దేశాయి బోల్డు రోజు లాలోచించారు. ఆఖరికి కెమికల్స్ ఫాక్టరీ పెడదామనుకున్నారు. అదైతే పెట్టుబడికి ఢోకా ఉండదని, పెద్ద పెట్టుబడి కూడా లక్కర్లేదని, దాన్ని ప్రభుత్వం జాతీయంచేసే ప్రమాదం తక్కువని దేశాయి అన్నాడు. ''మరే మరే'' అన్నాడు పటేల్.

ఆ రాష్ట్రంలో మహిమానది అని ఓ నదుంది. ఆ నదిలో ఏం వేసినా ఆ నీళ్ళు పాడవవని, దొరలున్న కాలంలో వాళ్ళు దాని మహిమ ఉట్టిదని బుజువు చెయ్యాలని చాలా తిప్పలుపడి చేతకాక సిగ్గులో తలవంచుకున్నారని ఓ కథ ఉంది. ఆ నది కొండలని వదిలి లోయల్లో అడుగు పెట్టినచోట ఓ చిట్టడివి ఉంది. అందులో యదేచ్ఛగా కులుకుతూ వంపులు తిరుగుతూ పోతూ ఉంటుంది మహిమానది. ఆ నది చుట్టు చిన్న చిన్న గుట్టలున్నాయి. వాటిమధ్య "కొండంత అన్నలు నాకున్నారు'' అనుకొనే ముద్దు చెల్లెలిలా మహిమానది ధైర్యంగా ప్రవహిస్తున్నట్లు అనిపిస్తుంది. అంత అందం చూడగానే మనసు చలించి పటేల్ ఫ్యాక్టరీ అక్కడే పెడదామని ముచ్చట పడ్డాడు దేశాయికి కూడా ఆ ప్రదేశం నచ్చింది. ఆ స్థలం సంపాదించాడు ఫ్యాక్టరీ కట్టడం కోసం.

చెట్లు నరికారు గుట్టలు చదునుచేశారు. మహిమానది బట్టబయలైంది ఫాక్టరీ కట్టడానికి కూలీలు వచ్చారు. వాళ్లకి టీలు, కల్లు అమ్మడానికి మరొకరు వచ్చారు. వీళ ందరికీ చాకలి, మంగలి కావల్సి వచ్చారు. పెళ్ళాం ని ఇంట్లో వదిలేసి వచ్చినవారికి మరెవరో కావల్సి వచ్చారు ఇల్లా ఏమీలేనిచోట గుడిసె పక్క గుడిసె, కొట్టు పక్కన కొట్టు వెలిశాయి, ఎగువన మంచినీళ్లు తాగి దిగువన బట్టలుతుక్కున్నారు, కాలకృత్యాలు తీర్చుకున్నారు. కానీ మహిమానది మైలపడలేదు. చుట్టాలు వచ్చినప్పుడు కొద్ది రోజులు శ్రమపడ్డ పడతి వాళ్లు వెళ్లిన కొద్ది రోజుల్లో గుక్క తిప్పుకున్నట్టుగా. కొద్ది దూరం ప్రవహించి సేద తీరి మళ్లీ స్వచ్ఛంగా, గలగలా ప్రవహించింది.

అయిదేళ్ల క్రితం ఫాక్టరీ పన్జేయడం మొదలు పెట్టింది. ఆ సమయంలోనే దేశాయికి తన బుద్ధి గడ్డితిన్నదేమోనన్న అనుమానం కలిగింది. పనివాళ్లతో తగువులు మొదలయ్యాయి. ఈ ప్రభుత్వం తనకు ఎదురుతిరిగిన రైల్వేవాళ్లని, మరోళ్లని నిర్దాక్షిణ్యంగా అణిచేస్తుందా! అదే ప్రైవేటు ఇండస్ట్రీస్‌లో పనివాళ్లను వెన కేసుకొస్తుంది తనకో సూత్రం మనకో సూత్రం'' అన్నాడు దేశాయి ''మరే మరే'' అన్నాడు. పటేల్. పనివాళ్లకి దిగువున ఇళ్లు కట్టించారు.

# కాలుష్యం కథ

అక్కడ కొన్నాళ్ళున్నాక "దిగువకి వచ్చే నీళ్లలో 'మందులు' ఉంటున్నాయి మా కెసువనే ఇళ్ళు కావా" అన్నారు పనివాళ్ళు "మరే మరే" అన్నాడు పటేల్. దేశాయికి విసుగుపుట్టడం మొదలు పెట్టింది. పటేల్ విసుగుపుట్టకుండా పనిలోకి వచ్చే ఆడవారి వెల్‌ఫేర్ విషయం శ్రద్ధాసక్తులు చూపిస్తున్నాడు. దేశాయి తల్లకిందులుగా తపస్సుచేసి పనివాళ్ల ఇళ్ళకోసం ఎగువన స్థలం సంపాదించాడు.

రెండేళ్ళ క్రితం ఫాక్టరీ పూర్తి కెపాసిటీతో పన్జేయటం మొదలు పెట్టింది. మహిమానది తనని ఆక్రమించుకోవాలని చూస్తున్న దుష్టుడితో పోరాడి అలసిపోయి ఓడిపోయిన ఆడపిల్లలాగా కలుషితమైపోయింది. మహిమానది మహిమ మట్టిలో కల్సిపోయింది.

ఒకసారి శీలం చెడిన ఆడదాన్ని పూర్తిగా పాడుచేసి గాని విడువరు మనుషులు. ఒక పరిశ్రమ కనుక ఓ నది దగ్గర వెలిస్తే దాని చుట్టూ మరికొన్ని పరిశ్రమలు వెలుస్తాయి. మహిమానది మరికొంత మంది పారిశ్రామి కుల్ని ఆకర్షించింది. పదిమైళ్ళ దిగువన మరో పరిశ్రమ వెలిసింది. 'యాచకో యాచకస్య శత్రువు' జైన్ పరిశ్రమ పెట్టినప్పటి నుంచి దేశాయికి తలనొప్పి మొదలైంది.

జైన్ ముందరగా దేశాయి అండ్ పటేల్ కంపెనీవారు కెమికల్స్ కలిపి మహిమానదిని పాడుచేస్తున్నారని ప్రచారం మొదలు పెట్టాడు. "మహిమానది శివుడి భార్య అయిన గంగాదేవి అవతారం. ఆవిడను మనుష్యమాత్రులమైన మనం పాడు చెయ్యడం ఏమిటి? ఇదో పెద్దజోక్!" అని పటేల్ ప్రచారం చేసాడు పుణ్య భారతదేశంలో మహిమలకే ఎక్కువ గౌరవం. మహిమలు చూపిన సన్యాసి, చూపని వేదాంతికంటే గొప్పవాడు! ఈ విషయం పటేల్‌కు బాగా తెల్సును. అందుకని ఎవరైనా "ఏమిటీ జైనుగ్గాని మతిబోయిందా! మహిమా నదేమిటి? మైలపడటం ఏమిటి?" అని బాహాటంగా తనపక్షం మాట్లాడ్తుంటే "మరే మరే" అంటాడు.

దేశాయి, పటేల్ వాళ్ల అడాలో ఉన్న మహిమా నదిమీద వాళ్ల పట్టు సడలించాల్లాగైనా అని జైన్ పట్టుపట్టాడు. అతని అదృష్టంకొద్దీ అతని ఫ్యాక్టరీలో పన్చేసే పనివాళ్ళు కొందరు, ఆ నదిలో కాలుష్యంవల్ల చచ్చిన చేపలు ఒడ్డుకు కొట్టుకువస్తే, వండుకు తిని చచ్చారు. వాళ్లు తినగా మిగిలిన చేపల కూరని పరీక్షలకి పంపి దానివల్లే వాళ్లు చచ్చారన్న విషయం నిర్ధారణ అయ్యాక, ఆ పనివాళ్ల కుటుంబాలకి దేశాయి అండ్ పటేల్ కంపెనీవాళ్లు నష్టపరిహారం చెల్లించాలని జైన్ గొడవ మొదలుపెట్టాడు. నిజానికి జైన్‌కి, అల్లా అని తన పనివాళ్ళకి, కలుషితంకాని నీళ్ళు తాగేమేరకైనా ఏర్పాటు చేసే ప్రేమ కూడాలేదు జైన్ తన పనివాళ్ల దృష్టి తనమీద పడకుండా ప్రభుత్వాన్ని స్మగ్లర్స్‌మీదకి ప్రజాదృష్టి మరలించినట్లు, దేశాయి పటేల్ మీదకి తిప్పాడు.

"దేశాయిచేత క్రితంసారి ఎన్నికల ఫండ్‌కి చాలాడబ్బు పటేల్ ఇప్పించాడు. అందుకనే ప్రభుత్వం పట్టించుకోవడంలేదు" అని జైన్ ప్రచారం మొదలు పెట్టాడు. "అవన్నీ

## నీరూ - నిప్పూ

నీరూ నిప్పూ
లేనిదెక్కడ చెప్పూ
నీరజాడులు మొదలు
నిటలాక్షుని వరకూ
కలసి ఉన్నాయి ఒకే కంటిలో
కాపురమున్నాయి ఒకే ఇంటిలో
ఒకటి మండించేది
ఒకటి నిండించేది
అది గ్రీష్మం
ఇది వర్షం
నిప్పు కాల్చివేస్తుంది
విషాన్నీ, కల్మషాన్నీ
నీరు కడిగివేస్తుంది
పాపాన్నీ, తాపాన్నీ
అది అరుణరాగం
ఇది కారుమేఘం
ప్రగతిని చాటే ఊర్ధ్వదృష్టి
క్రిందికి చూచే కరుణాసమదృష్టి
నిప్పూ నీరూ మనకు
తప్పనిసరి అంటున్నాయి.
ఇవి పరస్పరం శత్రువులు
మానవాళికి మాత్రం మిత్రములు

—హర్ష..

# కాలుష్యం కథ

మా కనవసరం మాకు, ఎవరో ఒకరు నష్ట పరిహారం చెల్లించాలి'' అంటూ కార్మికులు నినాదాలుచేసారు. రాజకీయనాయకులువచ్చారు. సమ్మెలు చేయించారు. పోలీసులు వచ్చారు కాల్పులు సాగించారు. ప్రభుత్వానికి తప్పనిసరై పోలీసు కాల్పులమీద ఓ దర్యాప్తు సంఘం, మహిమానది కాలుష్యం మీద ఓ నిపుణుల సంఘం నియమించింది. నిపుణుల సంఘ సభ్యులు మరో వారానికి నీటి శాంపుల్స్ సేకరించటానికి వస్తున్నారని తెలిసింది. అప్పుడే దేశాయి పదకొండుసార్లు తన బుద్ధి గడ్డితినుండాలని అనుమాన పడ్డాడు. అంటే అతని బుద్ధి పదకొండుసార్లు గడ్డి తిందని కాదు. అనుమానం పదకొండుసార్లు కలిగిందని పటేల్ గుర్తించాడు.

పటేల్ ఆలోచించాడు. రాత్రిం బగళ్ళు ఆలోచించాడు. జిన్ తాగుతూ ఆలోచించాడు. జూదం ఆడుతూ ఆలోచించాడు. వ్యభిచరిస్తూ ఆలోచించాడు. వ్యాపారం చేస్తూ ఆలోచించాడు. ఆలోచన పూర్తయ్యాక ఫెళఫెళా నవ్వాడు. "ఇంకా ఆర్రోజులున్నాయి కదా'' అనుకున్నాడు, దేశాయికూడా తెలియకుండా గుట్టుచప్పుడు కాకుండా పన్జరిపించాడు. నిపుణులు వచ్చారు శాంపుల్స్ తీసారు. మూతి బిగించి పరీక్షించారు. పరీక్షించాక తెల్ల మొహం వేశారు. నీళ్లలో చెప్పుకోదగ్గ కాలుష్యం లేదు. ఉన్నదికాస్తా మామూలుగా ప్రమాదకరమైన కాలుష్యం అనుకునే స్థాయి కంటే తక్కువగానే ఉంది. ఆ విషయం వాళ్ళు ప్రభుత్వానికి వ్రాస్తూ "పనివాళ్ళు తిన్న చేపలు కుళ్లిపోయినవి కావచ్చు. వాళ్ళు వాడిన మసాలా దినుసుల్లో కల్తీ జరిగి ఉండటం లాటి సాధారణ విషయంవల్ల వారు చచ్చుండవచ్చు అంతేగాని నీటిలో కాలుష్యం కారణం కాదు'' అని కూడా వ్రాసారు. మహిమానది పవిత్రమైనదని "ఆనదిని కలుషితం చెయ్యడం మనతరం కాదని'' పటేల్ కనిపించిన వాళ్లందరితో చెప్పాడు. నష్టపరిహారం ప్రసక్తే లేదు! ఎంతమంది ఆనదిలో పట్టిన చేపలు తినలేదు. వాళ్లందరు చచ్చిపోయారా? వీళ్లే ఎందుకు చచ్చిపోయారు? నూకలుచెల్లి! శివుడాజ్ఞలేందే చీమైనా కుట్టదు! ఇల్లాంటి వాదంతో నెగ్గుకురావటం మనదేశంలో చాలా సులభం. అందుకని పటేల్ దాన్నే చేపట్టాడు.

దేశాయి ఆశ్చర్యపోయాడు. ఆపైన పటేల్ని పిలిచి "నిపుణులల్లాంటి నివేదికెల్లా రాసారో నీకేమైనా తెలుసునా?'' అని అడిగాడు పటేల్ చిరునవ్వునవ్వి "ఆ ఆర్రోజులు మన ఫాక్టరీని సగం కెపాసిటీతో నడిపాను. నాలుగురోజులపాటు ఎఫ్లుయన్ట్ని, నదిలోకి కాక అడవిలోకి డైవర్ట్ చేసాను. చివరి రెండ్రోజులు డిటెన్షన్ పాండ్స్లో ఉంచేసాను ఈ ఆర్రోజులు, పేరుకి కొద్దిగా నదిలో వదిలాను ఎక్స్పర్ట్స్ పొలిమేరల్లోకి వచ్చారన్న కబురు తెలియగానే గొట్టాల నిండుకి ఎఫ్లుయెంట్ని నదిలోకి వదలటం మొదలుపెట్టాను. వాళ్ళు మన ఫ్యాక్టరీ దగ్గరకువచ్చి మనం పూర్తిగా మన ఫ్యాక్టరీ కల్మషాన్ని నదిలో కలుపుతున్నామని నమ్మకం కుదిరాక, జైన్ వాళ్ల ఫాక్టరీ దగ్గర శాంపుల్స్ తీసుకోడానికి వెళ్ళారు. వాళ్లయితే బర్మని జీప్లో వెళ్లారు గాని మనం అప్పుడే వదలటం మొదలుపెట్టిన ఎఫ్లుయంట్, వాళ్ళు వెళ్లేసరికి, అక్కడకు చేరుకోలేదు. అందుకని వాళ్ళ శాంపుల్స్లో చెప్పుకోదగ్గ కాలుష్యం లేకపోయింది. వచ్చిన నిపుణుల్లో ఆ లావుపాటి అతనున్నాడు చూసావుగా నిరంజన్! అతనికి దేవుళ్ళంటే భయం ఉంది. అతనికి మహిమానది మహిమ మీద పూర్తి నమ్మకం ఉంది. అందులో నమ్మకం లేకపోవటం పాపమనే నమ్మకం కూడా ఉంది. అతను ఉదర పోషణార్థం సైంటిస్టు. అతను శాస్త్రాన్ని, మహిమల్ని కూడా నమ్ముతాడు. రెండింటిని చెరో అరలోను పెట్టుకుని అవి కల్సిపోకుండా జాగ్రత్తపడ్తాడు. మహిమానది మహిమలో నమ్మకం ఉన్న అతనికి ఏ విధమైన అనుమానం అతని రిజల్ట్స్ కలుగుజెయ్యలేదు. అందుకని చచ్చిపోయినవాళ్ళు చచ్చిపోయినా మనం బతికిపోయాం. దేవుడు మనల్ని ఈ ఆపద నుంచి రక్షించాడు. ఎందుకైనా మంచిది నువ్వూ, వదినా కలిసి ఓసారి తిరుపతి వెళ్లి బాలాజీని దర్శించుకురండి. నేనిక్కడ వ్యాపారం చూస్తూ ఉంటా'' అంటూ అసలు విషయం వివరించాడు.

దేశాయికి దైవ భీతుంది. అందుకని పటేల్ మాటలు భయం కలిగించాయి. అందు

## కాలుష్యం కథ

కని అతనా విషయం ఇంక మాట్లాడ్డల్చుకో లేదు. కాస్సేపు నిశ్శబ్దంగా ఉన్నాడు. ఆ పైన "మనం మన ఫాక్టరీని ఆనుకొని ఉన్న పదెకరాల భూమి, మనకి కావాలని, దాన్ని ఫారెస్టు శాఖ చేత మన కిప్పించమని మనం ప్రభుత్వానికి అర్జి పెట్టుకుని ఏడా దైంది కదా! దాన్సంగతేమైంది సంజయ్" అని అడిగాడు.

"దానికి ఫారెస్టు డిపార్ట్మెంట్ ఏవో కుంటి సాకులు చెప్తోంది. ఆ సంగతి నే జూసుకుంటాలే నువ్వనవసరంగా బెంగ పెట్టుకోకు" అన్నాడు పటేల్.

* * *

జైన్ కూడా మహిమానది పట్ల భక్తి పెంచుకున్నాడు. తన ఫాక్టరీ ముందర ఆ దేవతకి చిన్న గుడి కట్టించాడు. ఆ పైన ధైర్యంగా తన ఫ్యాక్టరీ వేస్ట్ గూడా ఆనదిలో కలపటం మొదలుపెట్టాడు. మహిమానది పొడుగునా పరిశ్రమలు వెలిశాయి. మహిమా నది పొడుగునా ఆ దేవతగుళ్ళు వెలిసాయి. మహిమానది మాత్రం నల్లబడి, కంపు కొడుతూ ప్రవహిస్తోంది.

కాలుష్యం గురించి సంపన్న దేశాలలో గొడవ బయల్దేరింది. "డబ్బున్న దేశాలలో ప్రతిదీ సమస్యే. మనకు తిండి, బట్ట, నెత్తి మీద చూరులాంటి ముఖ్యమైన సమస్య లున్నాయి. అందుకని మనం కాలుష్యం గురించి కంగారు పడక్కరలేదు' అన్నారు మంతులు, ముఖ్యులు డబ్బు బాగా ఉన్న వాళ్ళ ఇళ్ళల్లోకి కలుషితమైన వాతావరణం జొరబడదు! అది అల్లా వుంచి "నీటి కాలు ష్యాన్ని నివారిస్తే ఆసుపత్రులమీద మందుల మీద అంతలేసి డబ్బు తగలేయక్కర్లేదు" అన్నారు విజ్ఞులు.

ప్రభుత్వం మొహమాటంగా నీటి కాలుష్య నివారణ చట్టం చేసింది. పారిశ్రామికుల్ని ట్రీట్‌మెంట్ ప్లాంట్స్ పెట్టి శుద్ధపరచిన ఎఫ్లుయంట్స్‌నే నదుల్లో వదలమన్నారు.

* * *

"ట్రీట్‌మెంట్ ప్లాంట్ పెట్టుకోడానికి ఓ పదెకరాల భూమి కావాలి మాకు" అని వ్రాశాడు పటేల్ అధికారులకి. వాళ్ళు అటవీ శాఖ నుంచి వీరు కోరిన స్థలం ఇప్పించారు. అయితే ట్రీట్‌మెంట్ ప్లాంట్‌ని సిమెంట్ లేని కారణంగా దేశాయి అండ్ పటేల్ కంపెనీవారు కట్టలేదు. సిమెంట్ బఠి మాలినా దొరకటంలేదు. పటేల్‌కి బఠి మాలడం అంటే అసహ్యం. "మనవంతు వచ్చినప్పుడే, మనం తీసుకోవాలి. అదేధర్మం. అంతేగాని ప్రభుత్వాన్ని ఇబ్బంది పెట్టరాదు" అంటాడు పటేల్ నిజమైన దేశభక్తుడిలాగా.

ఏతా వాతా తేలిందేమిటంటే దేశాయి అండ్ పటేల్ కంపెనీవారు కోరుకున్న పదెక రాల భూమి వాళ్ళకి దక్కింది.

నాతలకు రంగువేస్తే క్యాన్సరొస్తుందన్నారే, మరి నీ మీసాల సంగతేంటి - అంటాడి



## సీసంతింటే బుద్ధిమాంద్యం

చిన్న పిల్లలలో బుద్ధిమాంద్యానికి కారణం వారు గోడల మీది రంగులు, పెన్సిళ్లు, కాగితాలు, తదితరాలు నమిలి మింగడం, నాకడం వంటివేనని లక్నోకు చెందిన డాక్టరు సేథ్ లక్నోలో ప్రపంచ శాస్త్రవేత్తల సభలో అన్నారట. పై పదార్థాలలో సీసం అధికంగా ఉంటుందని, ఈ సీసం లోపలికి పోడమే పిల్లలకు బుద్ధి మాంద్యానికి కారణమని అన్నారట. పాలిష్ చేయబడిన మట్టి పాత్రలలో చేసిన వంటకాలలో కూడా ఈ సీసం కలుస్తుందని ఆయనన్నారట. రంగు బొమ్మలు అచ్చువేసే ఇంకులో కూడా సీసం ఉంటుందని, అట్టి బొమ్మలున్న కాగితాలు పిల్లలు నమలడం ద్వారా సీసం లోపలికు పోతుందని కూడా ఆయన నొక్కి వక్కాణించారట. ఈ సభకు హాజరైన బోల్డుమంది ప్రపంచ శాస్త్రవేత్తలలో చాలా మంది తలలడ్డంగా వూపి, పరిపూర్ణంగా ప్రయోగం జరగనిదే, నిరూపణ జరగనిదే ఇలా ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పడం ఏమంత బాగులేదని బుద్ధిమాంద్యం కుటుంబ పారంపర్యంగా కూడా రావచ్చని అన్నారట.

## నీటిపాలైన బాబా భక్తులు

ఉడిపి నుంచి సాయిబాబా భక్తులను పుట్టపర్తికి తీసుకువస్తున్న ఓ ప్రయాణీకుల బస్సు పాకాల వద్ద నీటి ప్రవాహంలో మునిగిపోయిందట. బస్సంతా నీళ్లల్లో మునిగిపోయి, బస్సు పై భాగం ఓ ఆరు అంగుళాలు మాత్రమే కనపడుతోందట. పదిహేను రోజులకుకూడా ఆ ప్రవాహం ఒరవడి తగ్గలేదట.

## ప్రయోగాత్మకమైన తీర్పు

అమెరికన్ మిలిటరీ ఫోర్సులో గనుక హొమొసెక్సు (తను పురుషుడై, పురుషునే కామించడం వగైరా వగైరా) వారుంటే, వారెంత పెద్ద ఉద్యోగంలో ఉన్నాసరే, వెంటనే ఉద్యోగం నుంచి తొలగించాలని చట్టం ఉందట. లియొనార్డ్ మాట్లొవిచ్ అనే ఆయన "హొమొసెక్స్" తరహా వ్యక్తని, గనుక చట్ట ప్రకారం ఆయన్ను ఉద్యోగంలోంచి తొలగిస్తూ, మిగతావారిని యీ తాకిడి నుంచి కాపాడాలని యీ విషయం కోర్టుకు లాగితే, ఈ విషయం మీద ఫెడరల్ జడ్జి తీర్పు ఇస్తూ లియొనార్డ్‌ను తొలగించడం ద్వారా యునైటెడ్ ఎయిర్‌ఫోర్సుకు తీవ్రమైన నష్టం కలుగుతుందని, ఈ నష్టాన్ని దృష్టిలో పెట్టుకుని ఆయన్ను

# ఫాలాకుని డైరీ

తొలగించటం లేదని, ఆయన తన ఉద్యోగాన్ని కొనసాగించాలని అన్నారట. అంతేగాక, ఈ రకమైన తీర్పు వో ప్రయోగంగా భావిస్తూ ఏం జరుగుతుందో చూద్దాం అన్నారట—వార్నీ!

**సమస్యలే లేని దీవి**

పసిఫిక్ మహాసముద్రంలో ఉన్న 8500 చతురపు మైళ్ల విస్తీర్ణం గల కుక్స్ దీవిలో కేవలం ఇరవైయ్యొక్క మంది మాత్రమే ఉన్నారట. ఇక్కడ జనాభా చాలా తక్కువని, జనాభా మాకు బోలెడు కావాలని ఆ దీవి మొర్రోమంటోం దట. అక్కడి జనులకు నిరుద్యోగ సమస్యల్లేవట. బయట దేశాలతో ఋణాలు వగైరాలు లేవట. మనమక్కడికి పోతేనో!!

**పంచరుతెచ్చిన తంటా!**

కర్నూలు సమీపంలో పంచరుపడ్డ కారు టైరును మార్చి కొత్త టైరు వేయడానికి ఒక కారు డ్రయివరు అవస్థపడుతూంటే అంత అర్ధరాత్రిలోను పిలిచినట్లు, కబురంపినట్లు వో ఇరవై మంది వ్యక్తులు పరుగుపరుగున కర్రలతో వచ్చి ఆ కారులో వారిని ఝడిపించి పదకొండు వేల రూపాయల కిమ్మత్తు చేసే నగా, నగదూ ఎత్తుకుపోయారట.

**సహగమనం**

జైపూరుకు చెందిన సివర్ జిల్లా మందాకలా అనే గ్రామంలో 11వ తేదీన ఒకాయన చని పోతే ఆయన భార్య శుబామ్మని ఎగిరి భగభగ మండుతున్న తన భర్త చితిలో దూకి సహగమనం చేసిందిట.

**బెయిలు నిరాకరిస్తే పారిపోయిన ఖయిదీలు!**

బీహార్ షరీఫ్ మాజిస్ట్రేట్ కోర్టులో బెయిలు కోరిన ఓ ఆరుగురు ఖయిదీలను హాజరుపరిస్తే మాజిస్ట్రేటుగారు విచారించి బెయిలిచ్చేది లేదు పొమ్మని అన్నారట. అంతే ఆ ఆరుగురు ఖయిదీలూ(పారి)పోయారటనిండు కోర్టు చూస్తుండగా.

**మహిళలు తిరస్కరించిన ప్రారంభోత్సవం.**

అంతర్జాతీయ మహిళా సంవత్సరంసదస్సుకు టోక్యోలో ప్రారంభోత్సవం చేయడానికి మహారాజా హిరోహిటో, ఆయన సతీమణి రాణి నగాకో వచ్చారట. వీరు ప్రారంభోత్సవం చేయ వీల్లేదని, స్త్రీలను సమానంగా చూడనివారిలో రాజ కుటుంబమే మొదట పేర్కొనవలసినదిగా వస్తుందని, కనుక మహిళా సంవత్సర సభలకు వారు ప్రారంభోత్సవం చేయడం సభల నవహాస్యంపాలు చేయడమేనని వో రెండొందలమంది స్త్రీలు నినాదాలు చేశారట టోక్యోలో. ఫలితం!! పోలీసు సదుపాయంతో రాజదంపతులు తామొచ్చిన పని ఎంచక్కా చేసుకు చక్కాపోయారట.

**సంతాన నిరోధిని ఇంజెక్షన్**

సంవత్సరానికోసారి ఆడవారికి ఒక రకమైన ఇంజక్షను యిస్తే ఆ ఏటి కామెకు పిల్లలు




పుట్టరని, ఈ రకం ఇంజక్షను ఏటకోసారి తీసుకుంటే కావలసినన్నేళ్ళు పిల్లలు లేకుండా ఉండొచ్చని, కుటుంబనియంత్రణ పథకాల్లో యీ ఇంజక్షను ఇప్పుడే ప్రయోగాల ద్వారా సత్ఫలితాన్ని పొందిందని, బజారులో మామూలుగా లభ్యమయ్యేటట్లు చేయడానికి 1980వ సంవత్సరం వరకూ అవ్వచ్చని, అంతవరకూ దీనితో మరి కొందరి మీద ప్రయోగాలు జరుగుతాయని, ఇంజక్షను కనుగొన్న ఆస్ట్రేలియా శాస్త్రవేత్త అన్నారట. 1980నాటికి పెరిగే జనాభానో?!

**కిడ్నాపింగ్**

ఢిల్లీలో లాయరు టి. హజారీగారి రెండేళ్ల అబ్బాయి బాబీని ఇరవైరెండేళ్ల అశోక్ అనే అతనెత్తుకుపోయి, సంభయి వేలిస్తేనే మీ అబ్బాయిని వదుల్తాను. లేకపోతే ఇంతే సంగతులు అన్నాడట. పోలీసులు అష్టకష్టాలు పడి, అతనా కుర్రాణ్ణి దాచిన వో హోటలు కెళ్లిఆ రూము తలుపులు పూడ లాగితే అశోక్ కత్తి తీసి, వీాది కొస్తే కుర్రాడు సఫా అన్నాడట. అయినా పోలీసులు పూరుకోలేదట. కుర్రాడు దక్కాడట.

**దేశంలో పెరిగే జనాభా**

ఏటికి పదమూడు మిలియన్ల పిల్లలు దేశ జనాభాకు కలుస్తున్నారని,యీ రకంగా పిల్లలు పుట్టడం ఆపడానికి ప్రభుత్వం మరింత గట్టి చర్య తీసుకుంటుందని కేంద్ర ఆరోగ్య మంత్రి డాక్టరు కరన్‌సింగ్ అన్నారట. మన దేశంలో ఒక్క ఏడాది పుట్టిన పిల్లలు ఆస్ట్రేలియా జనాభాతో సమానమట. భారతదేశానికి స్వతంత్రం వచ్చిననాటి నుంచీ 250 మిలియను జనాభా దేశానికి కలిసిందట. సోవియెట్ యూనియన్ మొత్తం జనాభా యీ పెరిగిన జనాభా అంతట. దేశంలో ఇప్పటికి 600 మిలియను జనులున్నారట— ఏంచేదాం !!

**రోడ్లూడ్చేవారి సమ్మె**

గ్లాస్గో పట్టణంలో రోడ్లూడిచే పనివారు సమ్మె చేసినందువల్ల ఆ పట్టణాన్ని వేరే వారిచేత వూడ్పించడానికి మూడు వారాలు పట్టిందని పన్నెండొందలమంది పనివారు వాహనాలూ, సామగ్రులూ కలసి నగరానికి 191,912 పౌనులు ఖర్చుచేశాయని పట్టణాధికారులు వాపోయారట. ●


రుచికరమైన, పుష్టికరమైన
బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు
RITANNIA
BRITANNIA
Glaxo
BISCUITS
పెరిగే పాపాయిలకు
రుచివంతమైన తోడు
బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు మరీ అంత ప్రత్యేకమైన రుచి గలిగి ఉండటానికి ఏమిటి కారణం? వాటిలో గల సమృద్ధినిచ్చే, సంపూర్ణమైన పుష్టినిచ్చే లక్షణాలే. పిల్లలకు యివి యిష్టం, పెరుగుతారు ఎంతో బాగా వాటితో. బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు ఎదిగే మీ పిల్లలకు ఎంతో మంచివి.
బ్రిటానియా
బిస్కట్లు అత్యుత్తమమైనవి
లింటాస్-BBC.GLX-6-140 TL

పట్టనేలేదు. విప్పుడు తెల్లవారిందో అప్పుడే సూర్యుడు కళ్లల్లోకి పొడుస్తున్నాడు. కలలో సౌదామిని ఇంకా భాస్కరం వళ్లో తల పెట్టుకుని డ్యూయెట్ పాడుతూనే వుంది.

సుబ్బమ్మగారు "అబ్బా! ఎంత ఎండె

## మే డి పం డు

(10వ పేజీ తరువాయి)

క్కింది!" అంటూ ఉలిక్కిపడి లేచింది. గుమ్మానికి తగిలించిన తాళాన్ని చూసి

"అయ్యో! రాత్రి తాళం తిప్పటం మరిచి పోయినట్టున్నాను!" అనుకుంటూ గొళ్లెం తీసి, ఇంట్లోకివెళ్ళి, మొగుడి ఫొటోకిదండం పెట్టుకుని, పెరట్లోకి వెళ్ళింది. రోజూలా భాస్కరం నూతిదగ్గర కనిపించలేదు. కానీ

అనసూయ నెత్తిన చెయ్యిపెట్టుకుని, దిగులుగా గుమ్మంలో కూర్చునివుంది. రోజూ ఈపాటికల్లా జడ్జీగారింటికి వెళ్ళిపోయే అనసూయ అలాకూర్చుని వుండటం ఆశ్చర్యమేసింది. సుబ్బమ్మగారు అవిడతో మాట్లాడటానికి ఇదే అదుననుకుని "అనసూయమ్మగారూ! ఏం అలా కూర్చున్నారు?" అంటూ పలకరించింది.

"అబ్బే. ఏమిటోనండీ! మనసు బాగాలేక కూర్చున్నానండీ!"

కొడుక్కి ఉద్యోగం దొరక్క అలా అంటోందని. "రేపటి నుండి నువ్వలా దిగులు పడక్కర్లేదులే!" అని సుబ్బమ్మ మనసులో అనుకొని, "మొన్నటి వరకు మీకసలు అబ్బాయి ఉన్నట్లే తెలియదండీ!" అంది తన ప్రస్తావనకు నాందిగా.

"ఆ. ఏం అబ్బాయి లెండి! చెప్పుకుంటే సిగ్గుచేటు! నా కడుపున చెడబుట్టాడు!" అంది బాధగా.

"అదేమిటి? ఉద్యోగం దొరకనంత మాత్రాన నిక్షేపంలాంటి పిల్లాడ్ని పట్టుకుని, అలా అంటోంది!" అనుకుని, సుబ్బమ్మగారు "రోజులొక్కలా వుండిపోవు లెండి! ఎంతలోకి మారాలి!" అంది.

సుబ్బమ్మగారు ఆప్యాయంగా సానుభూతి వాక్యాలు పలికేసరికి అనసూయకి కడుపులో వున్న దుఃఖమంతా ఒక్కసారి పైకివచ్చేసింది

"హరిశ్చంద్రుడిలాంటి ఆయన ఈ దౌర్భాగ్యుడి మూలంగా కుళ్ళి కుళ్ళి ప్రాణాలు వదిలేసినా కష్టతీపి చావక ఇన్నాళ్ళూ రెక్కలు ముక్కలు చేసుకుంటూ బ్రతికి వున్నాను. ఆ సంగతి ఆ దౌర్భాగ్యుడు గ్రహిస్తేగా, యికనుంచైనా ఆ పాడుబుద్ధి మాని, కష్టపడి నీతిగా బ్రతకరా అని మూడు రోజుల బట్టీ నెత్తీ నోరూ కొట్టుకొని చెప్తున్నానండి! వినినట్లే విని : ఈ రోజు మళ్ళీ మాయమైపోయాడండీ!" అంటూ అనసూయమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ చెప్పుకుపోతూ వుంటే సుబ్బమ్మగారికి ఏమీ అర్థంకావటం లేదు. అయోమయంగా చూస్తూ,

"ఎక్కడికి మాయమయ్యేడు?" అంది.

"అయ్యో రాత! ఎక్కడికని చెప్పనమ్మా? చిన్నప్పుడు ఆ తండ్రి నాలుగక్షరంముక్కలు నేర్చుకుంటే నిక్షేపంగా బ్రతకవచ్చురా" అని స్కూలుకి పంపుతే, అక్షరం ముక్కలు అబ్బలేదు కానీ, దొంగ చచ్చినాళ్ల సావాసాలబ్బి, దొంగచచ్చినాడయిపోయి. ఓ రోజు ఇంట్లో వున్న నాలుగు డబ్బులూ మూట కట్టుకుని, ఎక్కడికో మాయమయి పోయాడు. ఆయన వెతకగా వెతకగా ముదనష్టపువాడు జైల్లో వున్నట్లు తెలిసి, కుళ్లిపోయి, ఉన్న ఊళ్ళో తలఎత్తుకోలేక, చేసే పంతులు ఉద్యోగం మానేసి, ఈ ఊరు వచ్చేసుమ్మా! ఆ బెంగలోనే ఆయన మంచమెక్కితే నేను పొట్టకోసం జడ్జీగారింట్లో వంటక్కుదిరేను. ఏడాది క్రితమే ప్రాణాలొదిలేశారు. తండ్రిపోయిన మూడు రోజులకు ఎక్కడనుండి వూడి పడ్డాడో వడి. ఓ వారం వుండి మళ్ళీ మాయమయ్యేడు. మళ్ళీ మూడు రోజుల క్రితం వూడిపడ్డాడు. ఆ జడ్జీగారు ఏదో పని ఇస్తామన్నారు. ఇకనుంచైనా బుద్ధిగా వుండరా అని చిలక్కి చెప్పినట్టు చెప్పాను. ఆ భగవంతుడు అంద మిచ్చాడు కానీ, ఎందుకూ? గుణమివ్వ లేదమ్మా! వత్తి మేడిపండు! తెల్లారి లేచి చూస్తే మంచంమీద లేడు! ఇంట్లోకి వెళ్లి చూస్తే పెట్టె తెరిచి వుంది! నేను రెక్కల కష్టంచేసి, మూటకట్టిన డబ్బులు మూట లేదు! వాడసలు పుట్టకపోయినా బాగుండును. అనుకుంటూ మనసు బాగాలేక అలా కూర్చున్నాను!" అంటూ కళ్లనీళ్లు కార్చేస్తోంది, అనసూయమ్మ. ఈ కథ విని సుబ్బమ్మగారు "యింకా నయం'! అనుకుంటూ నూతిదగ్గర ముఖం కడుక్కుని, ఇంట్లోకి వెళ్లేసరికి, ప్రొద్దుటే సంగీత సాధన చేస్తే గొంతుబాగా సాగుతుందని మాష్టారు చెప్పటం చేత తాయారు మామూలుగా హార్మోనీ ముందు కూర్చుని, సా.పా.సా.ల స్రుతి కలపటానికి ప్రయత్నిస్తోంది. సుబ్బమ్మగారు తాయారు కేసిచూసి, "సీ సా. పా. సాలు చట్టుబండలు కానూనీ చెవుల బుట్టలేవే?" అంది. తాయారు ఉలిక్కిపడి, చెవులు తడుముకుంటూ లేచి పక్కలోకాని పడ్డాయేమో అనుకుంటూ పక్కబట్టల దగ్గరికి వెళ్లింది.

అప్పుడే లేచినకామేశ్వరి అలవాటు చొప్పున మంగళసూత్రాలు కళ్ళకద్దుకోవడానికి మెళ్లో తడుముకుంటే లేదు! పచ్చడిపద్దలా అరిగిపోయిన నానుతాడు పెరిగిపోయిందేమో అనుకుంటూ నిద్రపోతున్న చంటిదాన్ని లేవదీసి, కూర్చోపెట్టి, చిరుగుల బొంతను కంగారుగా దులుపుతోంది. దాంతో నిద్దట్లో చంటిది ఆరునొక్కరాగం ఆలాపించటం మొదలు పెట్టింది. ఈ హడావుడికిశేషగిరినిద్రలేచాడు. కలలో డ్యూయెట్ ఆపేసి సౌదామిని




కూడా ఉలిక్కిపడి లేచి తలుపుకేసి చూసి, "అయ్యో! రాత్రి గడియవేయటం మర్చిపోయినట్లున్నాను!" అనుకుంటూ గూట్లో వెంకటేశ్వరుని పటం దగ్గరకు వెళ్లి, చేతులెత్తి నమస్కరించుకుంటూ వుండగా రెండు రోజుల క్రితం జీతం తీసుకుని "అమ్మకి డబ్బు పంపాలి!" అనుకుంటూ ఆ పటం దగ్గర పెట్టిన పర్సు కనిపించలేదు! ఆతృతగా ఇల్లంతా కలియ తిరుగుతోంది.

అదేసమయంలో సుబ్బమ్మగారికి చటుక్కున భాస్కరం గుర్తుకువచ్చి గాభరాగా భోషాణం పెట్టె దగ్గరకు వెళ్లింది. పెట్టె తాళంతీసి వుంది! గుండె గుభేలుమని పెట్టె తెరిచి చూస్తే బుట్టల గొలుసు, కాసుల పేరు లేవు! సుబ్బమ్మగారు గుండెలు బాదుకుంటూ "అనసూయమ్మ తల్లోయ్! నీ కొడుకు నా కొంపగుల్లచేసి పోయాడమ్మోయ్!" అంటూ పెరట్లోకి వచ్చిపడింది. దాంతో చిరుగులబొంత దులుపుతున్న కామేశ్వరి, శేషగిరి, గదిఅంతా కలియ తిరుగుతున్న సౌదామిని, పక్కబట్టలు దులుపుతున్న తాయారు ఎక్కడివక్కడ వదేసి పెరట్లోకి వచ్చి పడ్డారు.

అనసూయమ్మ చటుక్కున లేచి నిలబడి ఆ దొంగచచ్చినాడు ఈసారి వచ్చేడంటే నేనే పోలీసుల కప్పచెప్పి. ఉరి తియ్యమని చెప్పి నా కసలు పుట్టలేదనుకుంటాను. పుట్టినా పురిటిలోనే సంధికొట్టుకు పోయేడనుకుని, ఓ ఏడుపు ఏడ్చి వూరుకుంటా! అంటూ కొడుకు మీద వున్న కసిఅంతా వెళ్ళగక్కేసి నాసంగతి జడ్జీగారి నడగండమ్మా! అంటూ జడ్జీగారింటికి బయలు దేరింది.

సుబ్బమ్మగారికి ఇక నోరు రాలేదు! శేషగిరికి జాలివేసింది. భాస్కరం రూపురేఖలు మాత్రమే అనవాళ్ళు చెప్పి- పోలీసు రిపోర్టు ఇచ్చేడు. కానీ, ఆ రాత్రే అన్నీ మూటకట్టుకుని, భాస్కరం బొంబాయి రైలు ఎక్కేసినట్టు ఎవరికి తెలుసు ?!




# హైదరాబాద్ నోట్ బుక్

## శ్రీ గణేశ్ ప్రసాద్ మిశ్ర

ఈ కాలంలో సాధారణమైన పిల్లలకు చదువు చెప్పడమంటేనే తలప్రాణం తోకకు వస్తుంది. ఈ కాలమే ఎందుకు ? పూర్వకాలంలోను విద్యార్థులు ఆగడాలు చేసేవారే. క్షేమేంద్రుడు ఛాత్రుల ఆకతాయితనం గురించి చేసిన వర్ణనలు చదివితే ఇప్పటి ఛాత్రులు ఎంతో మేలని పిస్తుంది. ఇలాటివారికి చదువు చెప్పడమే కష్టమయినప్పుడు ఖైదీలకు, వారి మనస్తత్వాన్ని గ్రహించి చెప్పడం కష్టతరం, కష్టతమం అని వేరుగా చెప్పాలా ? అలాటి ఖైదీలతో 25 సంవత్సరాలుగా పోరాడుతున్నారు శ్రీ గణేశ్ ప్రసాద్ మిశ్ర. ఈయన చెంచల్‌గూడలోని హైదరాబాద్ సెంట్రల్ జెయిలులో ప్రధానాధ్యాపకులు. ఈ జెయిలు పాఠశాలలో ఉన్న ఖైదీల జీవితాన్ని తీర్చిదిద్దుతున్న బోధన శిల్పి శ్రీ మిశ్ర. శ్రీ మిశ్ర పూర్వులు ఏడుతరాలకింద ఉత్తర భారతం నుంచి ఆంధ్రదేశానికి వచ్చారు. ఇక్కడివారితో కలిసిపోయారు. శ్రీ గణేశ్ ప్రసాద్ కళాశాలలో పట్టభద్రులై రాగానే ఏదో పాఠశాలలో కొంత కాలం పనిచేసి జెయిలు పాఠశాలలో ప్రధానాధ్యాపకులయ్యారు. ప్రభుత్వం తలపెట్టిన నిరక్షరాస్యతా నిర్మూలన పథకం తు. చ. తప్పక అనుసరిస్తున్నారు. ఖైదీలకు తెలుగు, ఉర్దూ, హిందీ బోధిస్తారు. సారస్వత పరిషత్తు, హిందీ ప్రచార సభ, ఇదారే అదబియాతే ఉరుదూ సంస్థ పరీక్షలకు ఖైదీలను సిద్ధపరుస్తారు. జెయిలు పాఠశాల ఫలితాలు 75 శాతంనుంచి 95 శాతం వరకు ఉన్నందుకు ఈయనకు 1965 లో నేషనల్ అవార్డు లభించింది. 1966 లో రాష్ట్ర ప్రభుత్వం బంగారు పతకం బహూకరించింది. 1967 లో సుప్రసిద్ధ హిందీ కవి దినకర్ లిటరరీ అవార్డు ఇచ్చారు. శ్రీ మిశ్ర మంచినటుడు, వక్త. ఖైదీలతో ప్రతి శనివారం సాంస్కృతిక కార్యక్రమాలు జరిపిస్తారు. రవీంద్రభారతిలో ఖైదీలతో నాటకాలు వేయించారు. 15 సంవత్సరాల క్రితం అనంతపురంలో ఆరుబయట జెయిలు స్థాపించినప్పుడు శ్రీ మిశ్ర తమ ఖైదీలతో ప్రదర్శనాలు ఇప్పించారు. శ్రీ రాజేంద్ర ప్రసాద్ రాష్ట్రపతిగా వున్నప్పుడు రాష్ట్రపతి భవన్‌లో ''మనుష్యకీ ఫరక్'' అనే విషయమై ఖైదీలతో ప్రదర్శన జరిపారు. పలుసార్లు రేడియోలో ఖైదీల మనస్తత్వాలను గురించి ప్రసంగించారు.

ఖైదీలు మంచి పౌరులు కావడానికి

## హైదరాబాద్ నోట్ బుక్

వీలుగా చర్చలు, గోష్ఠులు, ప్రసంగాలు నడుపుతారు. 1953 లో జవాహర్‌లాల్ నెహ్రూ వచ్చినప్పుడు, జవాహర్ బాలభట దళం ఏర్పాటు చేసి ఆయన మెప్పుపొందారు. "పుట్టుకతోనే ఎవ్వరూ అపరాధికాడు. వాతావరణం అలాటి పని చేస్తుంది. ఈ విషయాన్ని నేను నేషనల్ అవార్డు స్వీకరించినప్పుడు వివరించాను. ఖైదీలకు, తక్కిన పిల్లలకు ఏమీ బేధంలేదు.' అంటారు. ఆయన. ఏదో ఆవేశంతో అపరాధం చేసినవారు పశ్చాత్తాపపడడం ఆయన ప్రతి దినం చూస్తున్న సంగతి. ఆయన ఖైదీల ప్రేమ స్నేహాలు చూరగొన్నందుకు ఆనందం ప్రకటిస్తారు. 25 సంవత్సరాలుగా ఖైదీల జీవనస్తత్వంతో పరిచయమున్న శ్రీ గణేశ్ ప్రసాద్ మిశ్ర తమ అనుభవాలను గ్రంథరూపంలో లిఖితంచేసి ఆంధ్రావళికి మేలు కలిగించాలని కోరుకున్నారు.

### నగరంలో ప్రధాని

నవంబరు 17 వ తేదీన ఉదయం ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి జంటనగరాలకు విచ్చేసి సాయంకాలం వెళ్లిపోవడం ఒక ఝంఝామారుతం వీచి వెళ్లినట్లయింది. ఈ ఝంఝామారుతంలో నగరంలోని మురికి వాడలలోని మురికికొట్టుకుపోయింది, ప్రతిపక్షాల బలమూ వూడ్చుకుపోయింది. జంటనగరాలు రంగురంగుల దీపాలతో, ద్వారతోరణాలతో మరింత అందచందాలు సంతరించుకొన్నాయి. భాగ్య నగరమన్న పేరు నిజంగా సార్థకమయింది. శ్రీమతి గాంధి నగరంలో ఉన్న పదిగంటలూ నిర్విరామంగా పలు సమావేశాలలో పాల్గొన్నారు. ఉదయం 10 గంటలకు ఆమె విమానాశ్రయంలో దిగగానే గవర్నరు మొదలయినవారు ఘనస్వాగతమిచ్చారు. అక్కడినుంచి నేషనల్ పోలీసు అకాడెమీవరకు 20 కిలోమీటర్ల దారిపొడవునా ప్రజలు ఆమెకు ఘనస్వాగతమిచ్చారు. జంతు ప్రదర్శనశాలవద్ద ఆమె మెడలో ఒక గజరాజం పూలదండవేసింది. ప్రధాని జాతీయ పోలీసు అకాడేమీకి శ్రీకారం ఛుట్టచేస్తూ, మారుతున్న సామాజిక పరిస్థితులకు అనుగుణంగా పోలీసుల వైఖరిలో మార్పు రావాలని ఉద్బోధించారు. పిదప మధ్యాహ్నం ప్రధాని హైదరాబాద్ విశ్వవిద్యాలయానికి కుమారి పద్మజా నాయుడు దత్తం చేసిన 'గోల్డెన్ త్రెషోల్డ్' భవన సముదాయాన్ని లాంఛనంగా ఆ విశ్వవిద్యాలయానికి అంకితంచేస్తూ, శ్రీమతి సరోజినీనాయుడు, కుమారి పద్మజానాయుడు మున్నగువారి ఔదార్యాన్ని ప్రశంసించారు. అపరాహ్ణంలో అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా జూబిలీహాలులో జరిగిన మహిళా మహాసభలో ప్రసంగిస్తూ, భారతీయ మహిళలు ప్రాచీన భారతీయ సంస్కృతి సంపదకు, ఆధునిక విజ్ఞాన ప్రయోజనాలకు సువర్ణ

# మన దేవాలయాలు · ధర్మపథం · బులుసు వెంకటరమణయ్య

భారతదేశంలో స్థిరంగా ఉంటున్న నిర్మాణాలలో దేవాలయాలు మొదట గణించదగినవి. పూర్వకాలపు రాజులు తమ భవనాలకంటెను కూడా ఎక్కువ శ్రద్ధతో కోట్లకొద్దీ ధనం వెచ్చించి వాటిని నిర్మించేవారు. రాజభవనాలు నామరూపాలు లేక నశించిపోయినా, శిలానిర్మితాలయిన దేవా



లయాలు ఎన్నో శతాబ్దాలుగా చెక్కు చెదరకుండా ఉన్నవి. అవిదేవుని నివాసాలుకావడంవల్ల ఎంతో కాలం నిలుస్తాయేమో అనిపిస్తుంది.

జనసమూహాన్ని ఆకర్షించే శిల్పసంపదకు దేవాలయాలు నిలయాలు. వాటి గోపురాల పైని, స్తంభాలపయిని, గోడలమీద పురాణ గాధలుచిత్రింపబడ ఉంటాయి దేవాలయాలకు దానాలు చేసినవారి శాసనాలు కూడదేవాలయాల గోడలపయి ఉంటాయి. ఇవన్నీ విజ్ఞాన దాయకాలు అగుటలో ఆశ్చర్యం అక్కర్లేదు.

ఇలాగే డబ్బు బాగా ఉన్న ఆలయాలలో వెండి వాహనాలూ, ఇత్తడి మున్నగు ఇతర లోహాల వాహనాలూ ఉంటాయి. లక్కరంగుల కర్రవాహనాలు చాలా దేవాలయాలలో కానవస్తాయి. పెద్ద దేవాలయాలకు సొంతంగా ఏనుగులు మొదలైనవి కూడా ఉంటున్నవి.

ఇవన్నీ దేనికి? తన వైభవాన్నీ, సంపదనూ చూచుకుని దేవుడు సంతోషించడానికా? అది కానే కాదు. జనసమూహాన్ని ఆకర్షించడానికి!

దైవభక్తి లేనివారు దేవాలయాలకు వెళ్ళడానికి మొగ్గరు. గుడిలోని దేవుడు కాకపోయినా దేవాలయంలోని శిల్ప సౌందర్యం వాహనాలు, శాసనాలు మొదలైనవి వారిని ఆకర్షిస్తాయి. వీటికోసం దేవాలయంలో అడుగు పెట్టే – అట్టివారికి రానురాను దైవభక్తి కలగవచ్చును.

ముఖ్యంగా పసిబాలురకు దైవభక్తి కలిగించడానికి ఇవి బాగా ఉపకరిస్తాయి. పిల్లలకు దైవభక్తి ఆదిలో ఉండకపోవచ్చు. గుడికి చెందిన ఏనుగును చూడాలనే కుతూహలం వారిని గుడికి తీసుకువెళుతుంది. తర్వాత రంగురంగుల వాహనాలు ఎంతో ఆకర్షిస్తాయి. దినంలో చాలాభాగం వారు వాటిని చూస్తూ వినోదిస్తూ ఆకలి దప్పికలను కూడా మరిచి పోతారు.

వారికి క్రమంగా దైవభక్తి కుదురుతుంది. చిన్నతనంలోనే దేవునిపై భక్తి కుదిరినట్లయితే అది స్థిరంగా ఉండిపోగలదు.

ఈ విశాలమైన దృష్టితోనే మన పూర్వులు ఎంతో ధనాన్ని వెచ్చించి ఈ పథంగా దేవాలయాలను నిర్మించారు. ప్రభువులు తమ సౌధాలకంటె కూడా దేవాలయాల విషయమై ఎక్కువ శ్రద్ధ చూపేవారు.

---

సేతువుగా వ్యవహరించాలని హితవు చెప్పారు సాయంకాలం లాల్ బహదూర్ స్టేడియంలో జరిగిన అత్యపూర్వమైన బహిరంగ సభలో ప్రధాని దేశసమైక్యాన్ని, క్రమశిక్షణను, శక్తి సామర్థ్యాలను సవాలుచేసే ఏ చర్యనైనా వజ్ర సంకల్పంతో ఎదుర్కొంటామని హెచ్చరించారు. క్రమశిక్షణారాహిత్యాన్ని, విశృంఖలతను మరలతల ఎత్తనివ్వమని ఆమె మరొకమారు హెచ్చరించారు. విదేశశక్తులు మన ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకొంటే సహించమని ఆమె నొక్కి చెప్పారు. సాయంకాలం ఆరుగంటలకు ఢిల్లీకి బయలుదేరారు.

## హైదరాబాద్ నోట్ బుక్

### విష్ణుమహాయాగం

పంజాబ్ ప్రాంతంలోని డేగ్లూర్‌లో వున్న గృహస్థయోగి శ్రీ ఉపేంద్రజీ ఒక్క లక్షచండీ యాగాంతర్గత విష్ణు మహాయాగం నవంబర్ 16, 17, 18 తేదీలలో మహోజ్జ్వలంగా జరిపారు. ప్రపంచ శాంతి, దేశారిష్ట నివారణం ఈ యాగం లక్ష్యం. శ్రీ ఉపేంద్రజీ యోగి మాత్రమే కాక హిందీలో కవి, ఆయనదృష్టిలో ధర్మమంటే మానవులకు సహాయం చేయడం. కదలీవృక్షం ఏవిధంగా జీవితానికంతా ఒకేసారు ఫలిస్తుందో మనం ఆచరించే మానవతాధర్మం ఒక్కుమ్మడిగా ఫలిస్తుందని ఆయన ఉద్ఘోషిస్తారు.

"సహాయతా కరనా హై ధర్మకా ప్రమాణ్
కదలీ వృక్ష సమాన స్వయం కరనాజాన్"

అంటారు ఈ విష్ణుయాగం కార్తీక పౌర్ణమికి సమాప్తమయింది. ఆశ్వయుజ పూర్ణిమమొదలు విష్ణు సహస్రనామం. సవాలక్షసార్లు పారాయణం జరిగింది 16 వ అగ్ని ప్రతిష్ఠాపన మొదలు విష్ణు సహస్రనామ హవనం, సవాలక్ష తులసీ అర్చన పురుష సూక్త హవనం, చతుర్వేదా పారాయణం, ప్రసంగాలు జరిగాయి. స్వధర్మ స్వారాజ్య సంస్థ విద్యాంసులు శ్రీ సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి, శ్రీ గురుప్రసాద్, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి మొదలైనవారు విష్ణుయాగ ప్రాముఖ్యం గురించి సంస్కృత, హిందీ, తెలుగులలో ప్రసంగించారు. ఉపేంద్రజీ ఆయన సతీమణి శ్రీమతి పద్మావతీదేవి 18 న పూర్ణాహుతి జరిపిన పిదప సుప్రసిద్ధ కవి శ్రీ వసంతరావ్ తుల్జాపూర్‌కర్ యజ్ఞేశ్వరునిపై వ్రాసిన హిందీ కవితను గానం చేశారు. విష్ణు ఆకారంలో అన్నకూట పూజ మొదలైనవి జరిగాయి. ఉపేంద్రజీ తమ కవితను వినిపించారు గోపాల్‌కాలా(అవభృదస్నానం)తర్వాత వందలాది జనానికి అన్నదానం జరిగింది ఈ యజ్ఞానికి ఏకముఖరుద్రాక్షం ఒకటి, ద్విముఖ రుద్రాక్షం ఒకటి, ఏకాక్షనారికేళం, స్ఫటిక శ్రీ యంత్రం, దక్షిణాఫ్రికానుండి దక్షిణావర్త శంఖం రావడం విశేషమని శ్రీ ఉపేంద్రజీ అన్నారు.

**ఉపశ్రుతి:**

"ఏమిటినాన్నా, ప్రపంచ మహిళా సంవత్సరం ఈసంవత్సరమేఎందుకు పెట్టుకున్నట్టు?" అడిగింది నా చిన్న కుమార్తె ఆముక్త.

"ఎందుకమ్మా, ఏం తప్పా?" అని ఎదురు ప్రశ్న వేశాను

"ఈ సంవత్సరం రాక్షస సంవత్సరం కదా!" అన్నది ఆముక్త. నేను ఉలిక్కిపడ్డంత పనయింది.

—తిరుమల రామచంద్ర

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street,

# రాజేష్ ఖన్నా

ప్రతి రోజూ కొత్త ఆకర్షణ కొత్త రూపం
పేరు ప్రఖ్యాతుల సరికొత్త శిఖరం



వారం వారం కొత్త తీరులు, తెన్నులు, కొత్త తరహాలలో—బొంబే డయింగ్ వారి దర్జా అయిన బట్టలలో తయారు చేసినవి. సింథెటిక్ షర్టింగుల హుందా అయిన శ్రేణిలో—50/50, 67/33, 80/20, ఇంకా 100% పోలియస్టర్ ప్రింటులు, పోలియస్టర్ డెనిమ్స్, ఇంకా టెక్స్చరైజ్డ్ సూటింగులు.

**కాపితాన్** పోలియస్టర్ షర్టింగు
**వాడ్రీన్** పోలియస్టర్ సూటింగు



బట్టలలో ఎక్కువ మిక్కిలి అందాలు—
ప్రతి రోజూ సరికొత్త డిజైన్లకు రూపాలు

# బొంబే డయింగ్



BDM-27A tel



వైజయంతి మూవీస్

# ఎదురులేని మనిషి

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత. సి. అశ్వనీదత్ B.Sc.

దర్శకత్వం బాపయ్య

లక్ష్మీ ఫిలింస్

LAKSHMI

alpana

